## కథలు

"పరిష్కృతం" చాలా బావుంది. చదువూ, సంస్కారం లేని నాగరికులు అని పిలువబడే సామాన్య కుటుంబీకురాలి సుగుణాన్ని చిత్రించిన మధుశ్రీ గారు అభినందనీయులు.

బుర్రా భాస్కరరావు, బెంగుళూరు—1

శ్రీ సుబ్రహ్మణ్యం గారి "ఎలా నీకు చెప్పేది? కథ చాలా బాగుంది. కథ చివరి వరకు ఎంతో ఆసక్తి కలిగించింది. మాలతి, రాజారావుల పాత్రలు మరువ రానివి.

యం. వి. యస్. యస్ రాజు (మద్రాస్)

* * *

16—6—67 మీ వారపత్రికలో డి. కామేశ్వరి గారి కలం నుండి వెలువడిన "గురివింద కథ వాస్తవానికి చాల దగ్గరలో వుంది. ఈ నాటి కాలములో విలకడలేనిమనస్తత్వాలతో, లేనిపోని అపోహలతో ఒకరికి మరొకరికి గల వాస్తవ బాంధవ్యము మరిచి అపోహలకు గురి చేయడం తిరిగి వారినే కనుక ఆ అపోహలకు గురి చేసిన, వారికి కలిగే మనోక్షోభ రచయిత్రి చక్కగా వర్ణించారు.

తాంపల్లి రాజు (నిడదవోలు)

* * *

# ఉత్తరాలు

సుబ్బారావుగారి (పూనా) లేఖతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. ఈ ప్రాంతీయ ప్రతిబంధకం ఆంధ్రలలోనే కన్పిస్తుంది. ఆంధ్రేతర ప్రాంతాలలో ఉద్యోగాలకు ప్రయత్నించిన ఆంధ్రులందరూ ఇలాంటి పరిస్థితి ఎదుర్కొంటున్నారు. (ఆ కమిటిలో ఆంధ్రులున్నట్లయితే) ఇలాంటి ప్రతిబంధకాలు ఉద్యోగాల విషయాలలోనే కాదు! కనీసం ఆఫీసులో కూడా, పై ఉద్యోగులు, క్రిందివారితో మనస్ఫూర్తిగా మాట్లాడారు. ఇక్కడ కొంతమంది మళయాళీలు కేరళ ఉన్నతోద్యోగులలో మళయాళంలో మాట్లాడుతుంటారు. వారు కూడా మళయాళంలోనే జవాబిస్తుంటారు. ఓసారి ఆంధ్రదేశం నుంచి వచ్చిన ఓ ఉన్నతోద్యోగితో తెలుగులో మాట్లాడం తటస్థించినది. ఆయనగారు అప్పుడు ప్రాంతీయ భాషలలో మాట్లాడ వద్దని ఆంగ్లంలో సెలవిచ్చారు. కాని మరునాడు ఆ మహనీయుడు తమిళంలో తనతోటిఉద్యోగితో మాట్లాడుతున్నారు. ఆశ్చర్యంగా లేదు! ఇదే కాబోలు మధ్య తరగతి ఆంధ్రులకు మన ఉన్నతోద్యోగులు ఇచ్చే గౌరవం!

ఇలాంటి మహానుభావులు కొందరు ఇక్కడ వారానికొకసారి వచ్చే సినిమాలు చూడటానికి వస్తారు. వారు హాలులో ప్రవేశించినప్పటినుంచి బయటకు వెళ్ళేంతవరకు ఇంగ్లీషులో తెలుగును వ్యాఖ్యానిస్తుంటారు. ఎంత మంచి పాట వినిపించినా, బోరింగ్ అంటారు. అదే చిత్రాన్ని హిందీలో నిర్మిస్తే చాలా బావుందంటారు. ఆంధ్రుల ఆకాశవాణి వినాలంటే చాలమంది ఆంధ్రులకు విముఖత, ఇందుకు కారణం శ్రోతలు ఎంతమాత్రం బాధ్యులుకారు. మన ఆకాశవాణి నుంచి మనోరంజకమైన కార్యక్రమాలు ఆంధ్రులకు వినిపించవు. ఆంధ్రులకు అనుకరించే స్వభావం ఎక్కువ. అనుకరించటంలో ప్రసిద్ధులు. కాని మన ఆకాశవాణి అధికారులకు కనీసం ప్రక్కనున్న మద్రాసు ఆకాశవాణి కార్యక్రమాలను కూడా అనుకరించలేకపోతున్నారు. ఆంధ్రులు కారేమో?

ఏమైనప్పటికీ తెలుగంటే ఆంధ్రులకు, ఆంధ్రేతరులకు విముఖత నానాటికి పెరిగిపోతున్నది. కనీసం ఉత్తరాలు కూడా తెలుగులో వ్రాయరు. తెలుగు తెల్సినప్పటికి కూడా! ఉత్తర భారతీయులకు

# ఉత్తరాలు

దక్షిణభారత భాషలలో కల్లా తమిళ ముఖ్యమైనదిగా భావిస్తారు. అందుకు కారణం తమిళులు వారి భాషాభి వృద్ధికి చేస్తున్న కృషి, వారికున్న భాషాభిమానం.

భారతదేశంలో ఎక్కువగా మాట్లాడే (హిందీ తరువాత) తెలుగుభాష ఇప్పుడు ఏ స్థానంలో ఉన్నది? దేశ భాషలందు తెలుగులెస్స, "ఇటాలి యన్ ఆఫ్ ది ఈస్ట్", "కల్చరల్ లాంగ్వేజ్ ఆఫ్ సౌత్ ఇండియా" ఒకప్పుడు రెండు అణాలమీద ముద్రించబడిన ఏకైక భారతీయభాషకు ఇప్పు డున్న స్థానం ఏమిటి? కేంద్రప్రభుత్వం ఇస్తున్న భారతీయ సమాచార, చిత్ర, యోగ్యతాపత్రాలలో తెలుగుకు ఏ స్థానం ఇస్తున్నారు. మొదట ఇంగ్లీషు లేక హిందీ తరువాత తమిళం, నాలుగవ భాషగా తెలుగు వస్తున్నది. ఇందుకుకారణం ప్రభుత్వానికి తెలుగంటే చిన్న చూపా!

రోజుకు రోజుకు ప్రబలుతున్న ప్రాంతీయ ప్రతిబంధకాలను అణచివేయాలి. తెలుగంటే ఇప్పు డున్న విముఖత రూపుమాపటానికి, ప్రభుత్వం, ప్రతి ఆంధ్రుడూ కృషి చేయాలి.

బి. చౌధురి (న్యూఢిల్లీ)

## అధ్యక్షుడి మరణం

2.6.67 సంచికలో "అధ్యక్షుడి మరణం" నన్ను మొదటిసారే బాగా ఆకట్టుకుంది. ఈవారం వ్యాసాలకు ఎక్కువప్రాధాన్యం ఇచ్చినందుకు ధన్య వాదాలు. "ఎగిరేపళ్ళేలు" చదివి అంతరిక్షయానం చేసినంత సంబరం కలిగింది. రచయితకు ఎలా కృత జ్ఞత తెలియజేయాలో.....................

కె. సురేందర్‌రావ్ (బీర్కూరు)

## ఫిలిం బాలట్

19—5—67 వారం పత్రికలో మండూరు కొండయ్య (అనంతపురం)సర్వసిద్ధి చిరంజీవి (విశాఖ) సినిమాబాలట్‌ఫలితాల గురించి వెలువరించిన అభి ప్రాయాలు చూస్తే చాలా ఆశ్చర్యము వేసినది. నవరాత్రి, మనసేమందిరంలో అత్యుత్తమంగా నటించిన శ్రీ అక్కినేని ఉత్తమ నటునిగా రాకపోవ టము చాలా శోచనీయమని వ్రాశారు. బాగానే ఉంది. "పల్నాటియుద్ధం" మరికొన్ని చిత్రాల్లో అమోఘంగా నటించిన శ్రీ రామారావు ఉత్తమ నటునిగా రావటములో శోచనీయమేమీ లేదే! నిజంచెప్పాలంటే కొన్ని చిత్రాల్లో యస్. వి. రంగా రావు, గుమ్మడి, జగ్గయ్య వంటి ప్రముఖ నటులు వీరిద్దరినీ మించి నటించారు. కాని ఈ ఫిలింబాలట్ అనేది ప్రజాస్వామ్యము వలె ప్రేక్షక స్వామ్యము వంటిది. అందుచేత ఇందులో అన్యాయమునకు అవకాశములేదు.

బాలట్ విజేతలను గురించి వారెలా వచ్చారు; వీరెలా వచ్చారు అని అగౌరవంగా వీరిద్దరు ఇలా వ్రాయటం చాలా శోచనీయం. ఫిలిం బాలట్ విజేతలకు హృదయ పూర్వక అభినందనలు.

కామూరి రాజేందర్ (గుడివాడ)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 30— 6—'67
ప్లవంగనామ సం॥ జ్యేష్ఠమాసం బ॥ అష్టమి

సంపుటము : 59 సంచిక : 42

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక







# అధ్యక్షుని మరణం

5

విలియం మాంచెస్టర్



అమెరికన్ అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకి పోటిచేస్తూ డెమోక్రాటిక్‌పార్టీ అభ్యర్థులుగా జాన్ ఎఫ్. కెన్నెడీ, లిండన్ జాన్సన్‌లు రెండురోజుల ప్రచారనిమిత్తం టెక్సాస్‌లో పర్యటించడానికి వెళ్లినప్పుడు అభినందిస్తున్న అభిమానులు.

ఆ ఉదయం—అంటే నవంబర్ 22—6.30 గంటలకి మేలుకుంది మరీనా ఆస్వాల్డ్ చిన్నకూతురుకి పాలుపడ్తోంది. ఆమె భర్త ఆమె పడుకునిఉన్న మంచం కాలివద్దనుంచుని భార్యకీ, కూతురికి ఏవేవో కొనాలని అనుకుంటున్నానన్నాడు — ఆమెకి వస్త్రాలూ, జూనీకి బూట్లూ వంటివి. మరీనా అతనిమాటలు విననట్లే నటించింది. కొంతసేపటి తర్వాత కళ్ళుమూసుకుని నిద్రపోయింది.

బూడిద రంగులాగూ, డ్యూటీకి కావలసిన షర్టూ వేసుకున్న ఆస్వాల్డ్ ఇల్లువదిలి వెళ్లేముందు తన వివాహచిహ్నమయిన ఉంగరాన్ని ఒక కప్పులో వదిలివేశాడు. నిత్యాపజయమే తెలిసిన ఇతను ఆరోజు ఏదో నిరూపించపోతున్నాడు. తను మగవాడు, ఇతరులు అసహ్యించుకొనతగినవాడుకాదు.

పడకగదిలో 187 డాలర్లనోట్లు వదిలి వెళ్లాడు. తనదగ్గర 15 డాలర్ల చిల్లర మాత్రం ఉంచుకున్నాడు. దానితో ఎంత దూరం సాగుతుంది? ఎంతదూరం అనవసరం అతనికి తెలుసు.

ఫిఫ్త్ స్ట్రీట్‌వెంబడే కొంతదూరం నడిచాడు. రయిఫిల్, దుర్భిణిసాధనంఉన్న కాగితంపొట్లం చేతపట్టుకున్నాడు. వెస్లీ ఫ్రేజర్ ఆస్వాల్డ్‌ని తన ఇంటిబయట కలుసుకుని కారులో ఎక్కించుకున్నాడు.

'పొట్లం ఏమిటది?' అని అడిగాడు.

'తెర తగిలించే కర్రలు,' అన్నాడు ఆస్వాల్డ్ పొడిగా. అప్పటికి 7—25 గంటలయింది.

అయిదు నిముషాల తర్వాత ఫోర్ట్‌వర్త్‌లో అధ్యక్షుడి పరిచారకుడు 850 నంబర్ కల వాటా ప్రవేశించాడు. నేరుగా తన యజమాని పడుకుని ఉన్న గది తలుపు దగ్గరికు వెళ్లి తట్టాడు.

'మిస్టర్ ప్రెసిడెంట్,' అని పిలిచాడు జార్జ్ థామస్ నెమ్మదిగా. లోపల దుప్పటీ, శాలువలు రెపరెపలాడాయి. తలుపు తెరుచుకుని లోపలికి వెళ్లాడు. 'బయట వాన కురుస్తోంది,' అన్నాడు.

'అరెరె, ఇదేమిటి! అన్నాడు జాన్ కెన్నెడీ నిద్ర మత్తుగా.

డ్వయిట్ అయిసెన్ హోవర్‌కి వార్తాపత్రికలు చదవటం ఇష్టంలేదు. కాని కెన్నెడీ ప్రతిదినం ప్రముఖ పత్రికలు తిరగవేసేవాడు, నిద్రలేవగానే. తన పర్యటన గురించి 'ఎవరేమనుకుంటున్నారో,' అనే కౌతుకం అతనికి సహజంగా కలిగింది.

ఈ వార్తలు చూస్తూ ఉంటే యార్బరో, కాన్నలీల పోట్లాటయి పత్రికలలోకి ఎక్కినట్లు తెలిసింది. డల్లాస్ 'న్యూస్' పత్రిక ఈ విరోధాలని గురించి కొంచెం అతిగా రాసింది. 'కెన్నెడీ పర్యటన చుట్టూ రాజకీయ వివాదమనే తుఫాను,' 'యార్బరో ఉపాధ్యక్షుడిని అవమాన పరిచాడు,' అన్న శీర్షికలు మొదటి పేజి మీదా,' అధ్యక్షుడి పర్యటన వల్ల రాష్ట్రంలో డెమాక్రెటిక్ పార్టీలో చీలిక పెద్దదవుతున్నట్లుంది.' అన్న శీర్షిక లోపలా ప్రచురించింది.

కెన్నెడీకి వళ్లు మండింది పేపరుని అవతల పడవేశాడు. తర్వాత పేజీలో నల్ల అంచు కట్టిన ప్రకటన ఒకటి ఆయన గమనించలేదు. సయిన, 'డల్లాస్‌కి వస్తున్న శ్రీ కెన్నెడీకి స్వాగతం—' అని వ్యంగ్యం ఉట్టి పడుతున్న శీర్షిక; కింద 'అమెరికా సత్యాన్వేషణ సంఘం' అనే సంఘం అధ్యక్షుడిని కొన్ని ప్రశ్నలు అడిగింది. (ఈ సంఘాన్ని స్థానిక బిర్చర్ సొసయిటీ—తీవ్రవామ పక్షాలలో ఒకటి — ప్రముఖుడు

్ఛకను నిర్వరచాడు.) ఈ ప్రశ్నల వెనక కొన్ని ఆరోపణలు ఉన్నాయి. 1. కెన్నెడీ ఏందరో వేలమంది క్యూబన్ల నిర్బంధానికీ, ఆకలితో మాడటానికీ బాధ్యుడు. 2, వియత్నామ్‌లో అమెరికన్ సైనికులని చంపుతున్న కమ్యూనిస్టులకి కెన్నెడీ ఆహారం అమ్ముతున్నాడు. 3. కెన్నెడీ అమెరికన్ కమ్యూనిస్టులతో రహస్య వప్పందానికి వచ్చాడు.

ఈ ప్రకటన చదవకపోయినా, రాజకీయ ఉష్ణోగ్రస్థితి అధికం అవుతున్నదని గ్రహించాడు కెన్నెడీ. ఫోన్ తీసుకుని తన కార్యదర్శి కెన్‌వో డొన్నెల్‌తో ఆనాడు సెనేటర్ యార్బరో ఉపాధ్యక్షుడి కారులో వెళ్ళేట్లు చూడాలని చెప్పాడు. కుంటిసాకులు పనికి రావన్నారు. యార్బరో ఉపాధ్యక్షుడికారులో వెళ్ళకపోతే నడిచివెళ్ళాలిసిందే అన్నాడు.

కొంతసేపు తర్వాత అధ్యక్షుడు గది వదిలి బయటికివచ్చాడు. దీర్ఘాలోచనలో ఉన్నాడు. ఇద్దరు రహస్య రక్షకభటులు కనిపించటంతో, 'జాకీకి సాయం చెయ్యటానికి మేరీ గల్లాఘర్ రాలేదేం రాత్రి?' అని అడిగాడు. ఆవిడకి మోటారుకారు ఊరేగింపులతో ఏంపని? మేము వచ్చేముందే ఆవిడ హోటళ్లకివచ్చి ఏర్పాట్లు చూసుకోవాలి కదా? ఇంతదాకా అదేమీ కనిపించలేదు! అదేమిటో చూడండి!'

ఇంతలో చిరాకుపోయింది. ఆ హోటల్లో ఉంటున్న ఒక వృద్ధురాలు నడవలేక చక్రాల కుర్చీలో వెదుతూ కనిపించింది. ఒకక్షణం ఆగి ఆవిడతో నెమ్మదిగా మాట్లాడాడు.

హోటల్ లాబీలో అధ్యక్షుడి పరివారం గుమిగూడుతోంది. అధ్యక్షుడు వీధిలోకివెళ్ళి అక్కడి గుంపులో కలిసిపోయాడు. సన్నగా పడుతున్న జల్లునికూడా లెక్కచెయ్యలేదు. పొగమంచు కూడా పట్టింది. సీక్రెట్ సర్వీస్ ఏజంటు ఒకతను రెయిన్‌కోటు తీసుకువచ్చి తొడగపోయాడు కాని కెన్నెడీ వద్దన్నట్లు తల ఆడించాడు. ఉత్సాహంగా నవ్వుతూ అక్కడేఉన్న (ఉపన్యాసం) 'ట్రక్' ఒకటి ఎక్కి నించున్నాడు. అక్కడ అందరికీ అతనికి వచ్చిన ఉత్సాహంరాలేదు. 'టయిమ్' పత్రిక విలేఖరి హ్యూగ్‌సిడీ ఉపాధ్యక్షుడు నుఖా వంగా ఉండటం గమనించాడు. 'గుడ్ మార్నింగ్' చెప్పినప్పుడు జాన్సన్ ఒకసారి తలపంకించి ఊరుకున్నాడు.



1963 నవంబర్ 22 వ తేదీన వాషింగ్‌టన్ తిరిగివెళ్తున్న అధ్యక్షుని విమానం.

బయట భర్త గొంతుక లవుడ్‌స్పీకర్‌లో మోగుతూఉంటే గదిలో జాక్వలీన్ కెన్నెడీ బయట వానకురవటంచూసి సంతోషించింది. వానకురిస్తే కారుటాపువెయ్యాలి. టాపు ఉంటే జుట్టు చెరగదు. జుట్టు చెరగకుండా చక్కగా దువ్విఉంటే భర్త సంతోషిస్తాడు. అసలే తను అలిసిఉంది. అలసట ముఖంమీద స్పష్టంగా కనిపిస్తూఉంది. అద్దంలో ముఖం చూసుకుంది. 'మేరీ! ఒకరోజు ప్రచారం మనిషికి ముప్పయిఏళ్ళు ఎక్కువ చేస్తుంది,' అన్నది మేరీ గల్లాఘర్‌తో.

వెస్లీ ఫ్రేసియర్ డల్లాస్ పొలిమేరలకి వచ్చాడు. వాన కురవటం ఆగింది. 'బుక్ డిపాసిటరీ' దగ్గరకి రాగానే కారు ముందు అద్దం తుడిచే 'వయిపర్ల'ని ఆపి, వాతావరణం కొంచెం బాగుపడటం చూసి బాటరీ చార్జి చెయ్యటానికని ఇంజన్‌ని ఊరికే ఆడనిచ్చాడు. ఈ ఆలస్యం ఆస్వాల్డ్‌కి నచ్చలేదు. విసుగుగా దిగిపోయాడు పొట్లం చేత పట్టుకుని ఫ్రేసియర్ కూడా కారు దిగి వెంట వెళ్ళాడు. కాని, ఆతను ఆ కట్టడం చేరేలోపలే ఆస్వాల్డ్ లోపలికి మాయమయి పోయాడు.

ఆ తర్వాత ఆస్వాల్డ్ ఏమిచేసి ఉంటాడు? గట్టిగా చెప్పలేము కాని ఊహించవచ్చు. ఈ ఊహని బలపరిచే సాక్ష్యం కొంత ఉంది. అక్కడి సూపరింటెండెంటు, రాయ్‌ట్రూలీ అతన్ని చూశాడు. 'గుడ్‌మార్నింగ్ లీ.' అని పలకరించాడు.

'గుడ్ మార్నింగ్ సర్! అన్నాడు యథావిధిగా ఆస్వాల్డ్. కాని, ట్రూలీకి ఈ సంఘటన చూచాయగా మాత్రం గుర్తు ఉంది. ఆస్వాల్డ్ చేతికింద పెద్ద పార్సెల్ ఉన్నట్లు జ్ఞాపకం లేదు. అతను అసలు ఆ ఉదయం సంగతి గురించే చెప్పాడో లేక అంతకిముందు మరొకసారి ఆస్వాల్డ్‌ని కలుసుకున్నప్పటి సంగతి గురించి పొరపాటున చెప్తున్నాడో నిర్ణయించటం కష్టం. లీ ఆస్వాల్డ్ అప్పటికే ఆరవ అంతస్తుకి — లిఫ్టు ఎక్కి—వెళ్ళిపోయాడు. బుక్ డిపాసిటరీ కట్టడం వాయువ్యం వయిపున ఒక చోట, అంతకి ముందే ఎంచుకున్న ఒక చోట, తుపాకిని దాచాడు.

ఇక్కడా, తక్కిన ఎన్నో విధాలుగా లాగానే, అతనికి విధి తోడ్పడింది. అక్కడ నేల నూనె కారులోంది. అక్కడ పుస్తకాలు పెడితే నూనె అంటుకుంటున్నదని ట్రూలీ నేల మీద ప్లయివుడ్ చెక్కలు వేయించే ఏర్పాట్లు చేయించాడు. ముందు సగం నేల మీద పని చేయించమన్నాడు. దీని కోసం కట్టడం ఉత్తరం వయిపున అట్టపెట్టెలన్నీ ఖాళీచేయించారు. దక్షిణం వయిపు వాటిని కుప్పలు కుప్పలుగా పడవేశారు. మోటారు ఊరేగింపు చూడాలంటే ఇటు నుంచే చూడాలి, ఇక్కడ పెట్టెల వెనుక దాక్కోనటం తేలిక. ఆ ఉదయం కొన్ని పెట్టెలని తనకి తోచినట్లు అమర్చుకున్నాడు ఆస్వాల్డ్. వాటి మరుగులో నుంచుంటే అధ్యక్షుడి కారు ఎదురుగా వస్తూ కనిపిస్తుంది. వచ్చి కుడివయిపుకి తిరుగుతుంది. ఎదుట 'డాల్ — టెక్స్' కట్టడం ఉంది. కాని, పెట్టెల మరుగున

(10 వ పేజీ చూడండి)

# లివ్ అండ్ లెట్ డై













నేను న్యూయార్క్‌లో దిగ్గానే ఎఫ్. బి. ఐ. వ్యక్తి నను కల్సుకున్నాడు, కానీ నేనీ కొత్తపనిలో దిగకముందే నన్నెవరో వెంబడిస్తున్నట్లు పసిగట్టాను.

బాండ్ కొత్త అడ్రస్ మిస్టర్ బిగ్ అన్న అతను గుర్తు పెట్టుకున్నాడు.










'మిస్టర్ బాండ్, మీకిక్కడ సౌకర్యంగా ఉంటుందని ఎఫ్. బి. ఐ. తరఫున నే ఆశిస్తున్నాను. మీ రూం నెంబర్ 2100'

'[illegible]!'

'ఏమిటీ విపరీతం!'

ఫరవాలేదు జేమ్స్, తేలిగ్గా ఊపిరిపీల్చుకో. మళ్ళీ స్మెర్ష్ వేటలో మనిద్దరం భాగస్తుల్లా కన్పి[illegible]

# కొత్త జేమ్స్ బాండ్ బొమ్మల సీరియల్ ప్రారంభం!




'మళ్లీ మనం ఇందులో కలిశాం కాబట్టి యిద్దరి తెలివి తేటలతో శత్రువు పని పట్టొచ్చు ఫెలిక్స్.'
'అవును జేమ్స్— భోజనాలదగ్గర ముందే ఊహించి ఆర్డర్ చేశాన్లే.......'

'పులుసుతో పీతలు, మాంసం, ఫ్రెంచ్ ఫ్రైడ్ బంగాళ దుంపలు. అమెరికాలో మీకు దొరికే అన్ని రకాలూ........'

'విందుగురించి మాట్లాడుతున్నావ్. మనం వెంటాడుతున్న మిస్టర్ బిగ్ ఎంత పెద్దవాడు ?'
'అతను దొంగేకాదు జేమ్స్, అతి భయంకరమైన రష్యన్ ఏజంట్లలో ఒకడు. తన వాళ్ళందర్నీ బ్లాక్ మాజిక్ తో అదుపులో ఉంచుకుంటాడు.'




'బ్లాక్ మాజికా?'
'దాన్నే ఉడూ అని కూడా అంటారు'

బువానా పార్టే ఇగ్నస్‌గాలియా హాయితీలో పుట్టాడు. అతని తండ్రి— ఫ్రెంచి వ్యక్తి. చిన్నప్పట్నుంచే అతనికి ఉడూ నేర్పారు....'

'మొదట దొంగగా తర్వాత సోవియట్ ఏజెంట్‌గా హార్లెమ్‌ని తన స్వాధీనంలో ఉంచుకోడానికి బహిరంగంగా అతను ఉడూని ఉపయోగించేవాడు.'




'ప్రస్తుతం మనకి తెల్సినట్లు మీ దేశంలోని రష్యన్ గూఢచారుల ముఠాకి మిస్టర్ బిగ్ పెట్టుబడి దారనుకుంటా ఫెలిక్స్'
'ఇదినాకు తెలీదు. ఎలాతెల్సింది?'

'అమెరికా అంతటా వేలకొద్దీ పాతబంగారు నాణాల్ని అమ్ముతూ ఉండటం మీ ప్రజలు చూశారు. అందులో కొన్ని బ్రిటిష్‌వి. గుప్తధనం, నిజానికి అది సముద్రపు దొంగల ఖజానా, ఇంకా చెప్పాలంటే కెప్టెన్ మోర్గాన్ ది!'

'ఈ నిధిని మిస్టర్ బిగ్ కనిపెట్టాడనుకుంటాం. దాన్ని కనిపెట్టడమే నా విధి.'

(ఇంకా ఉంది)

## లోకం పోకడ

—ఇంతవరకూ యు. ఎ. ఆర్. సేనలు పెద్ద యుద్ధంలో పాల్గొనలేదు. అందుచేత (ఈ దేశం) మధ్యధరాసముద్ర ప్రాంతంలోని అమెరికా, బ్రిటిష్ నావిక దళాలని తన మీద దురాక్రమణలోని భాగాలుగా ఎంచి దానిని అరికట్టటానికి తగినచర్యలు తీసుకుంటే ఆశ్చర్యంలేదు.

8—6—67 స్టేట్స్‌మన్.

* * *

—'వంటగది కాబినెట్' ప్రధాన మంత్రి వర్గాన్ని వదలి పెట్టాలంటున్నది.

—కరెంట్ (10—6—67)

* * *

—శ్రీ వాఘ్లా యు. ఎ. ఆర్. ని తాముపూర్తిగా బలపరిచినప్పటికీ అధ్యక్షుడు నాసర్ తన పత్రికా (విలేఖరుల) సమావేశంలో భారత దేశం గురించి ఒక్క మాట కూడా చెప్ప లేదు. ఈ సమావేశంలో వెయ్యిక, వెయ్యిక (ఫ్రెంచి) అధ్యక్షుడు డిగోల్ అనుసరిస్తున్న విధానాన్ని ఎంతో ప్రశంసించారు.

9—6—67 స్టేట్స్‌మన్‌లో ఇంటర్ [illegible].

* * *

—యు. ఎ. ఆర్. [illegible] కాలం యుద్ధం కొనసాగుతుంది.

—ఇజ్రాయిల్ దురాక్రమణ కొనసాగితే యు. ఎ. ఆర్. కి సోవియట్ సహాయం ఇప్పటి కన్నా ఎక్కువ లభ్యమై [illegible] వుంటుంది.

8—6—67 స్టేట్స్‌మన్.

* * *

—అమెరికా, బ్రిటన్లు కూడా చైనా, పాకిస్తాన్‌ల దురాక్రమణలకు తోడ్పడి [illegible]....

11—6—67 స్టేట్స్‌మన్

అభియోగాలలో వింతలు

# తండ్రి యెవరో తెలియని బాలిక

ఆమె తండ్రి యెవరో తేల్చే నిమిత్తం
తొమ్మిది సంవత్సరాల వయస్సు
బాలిక శరీరంలోని రక్తాన్ని
పరీక్షింపవలసినదిగా న్యాయమూర్తి
శ్రీ ఆర్‌మ్ రాడ్ ఆదేశించారు.
—శరీరంలోని రక్తాన్ని
పరీక్షించకపోతే ఆమె తండ్రి
ఎవరో నిర్ధారించడం సాధ్యం
కాదన్నారు న్యాయమూర్తి.

ఈ బాలిక తల్లికి భర్త ఉన్నాడు. మరొక ప్రియుడు ఉన్నాడు—తల్లి భర్త పోషణలో యీమె ఆరు సంవత్సరాలున్నది. కానీ, ఇప్పుడు తన తల్లి వివాహం చేసుకో వాలనుకుంటున్న ప్రియుని పోషణలో ఉంటు న్నదని 'విడాకుల న్యాయస్థానం' న్యాయ మూర్తి ఆర్‌మ్ రాడ్ వివరించారు.

తన తల్లి ప్రియుడే తన తండ్రి అని ఈ బాలిక అనుకొంటున్నది. న్యాయమూర్తి యిట్లా అన్నారు: 'ఈ బాలిక తనబిడ్డయే నని భర్తగానీ, ప్రియుడుగానీ అనడంలేదు—తమవల్ల ఈ బిడ్డ జన్మించలేదని కూడా వీరు అనడంలేదు. తల్లి కూడా ఎటూ చెప్పలేకపోతున్నది.

'బిడ్డ తండ్రి యెవరో తెలుసుకోవాలని ఈ ముగ్గురూ ఆదుర్దాపడుతున్నారు.'

ప్రియుడితో ప్రేమాయణంలో పడిన భార్యనుంచి వేరేపోవడానికి భర్తకి అనుమతి లభించినది. ఇక తేలవలసిందల్లా బిడ్డ సంగతి.

తమ రక్తాన్ని పరీక్ష చేయించుకోడానికి ఈ ముగ్గురు పెద్దలూ అంగీకరించారు.

న్యాయమూర్తి ఇంకా యిట్లా అన్నారు:

'సందేహం అనేది మనస్సును వేధిస్తూ తూండగా యీ నలుగురి మధ్యా ఆప్యా యత ఉండదు. రక్త పరీక్షద్వారా నిజాన్ని తేల్చితేనేగానీ యీ సమస్య పరిష్కారం కాదు.'

—వి. ఎస్. అవధాని.

# అధ్యక్షుని మరణం

(7-వ పేజీ తరువాయి)

ఉన్న ఆఫ్వాల్డ్ అక్కడ వుండుని చూసే వారికి కనిపించడు. అతను గురిపెట్టేటప్పుడు ఎందరో అతనికి 'అడ్డు' ఉంటారు. (ఇతర ప్రేక్షకులు.) తను తుపాకీలోని తూటాలు మార్చినప్పుడు అందరితో ఎక్కడని కని పెట్టాడు?

హౌస్టన్‌వీధి అవతల అబ్రహామ్ జాప్రూడర్ 'డాల్‌టెక్స్' కట్టడం నాలు గవ అంతస్తులోని తన వస్త్ర వ్యాపారపు ఆఫీసు గదిలోకి వచ్చాడు.

'మీ కామెరా తీసుకొస్తానన్నారు, ఏదీ?' అని అడిగింది అతని సెక్రెటరీ.

'ఇంట్లో' అన్నాడు అతను విరుసుగా, అది వారికి అలవాటే—తమాషాకి ఉద్యోగి తన అధికారిని మందలించినట్లు నటించటం, అతను భయపడినట్లు నటించటం.

'మిస్టర్ జెడ్, అయితే ఇంటికి వెళ్ళి రండి! ఇలా అధ్యక్షుడి కలర్ ఫోటోలు మళ్ళీ ఎప్పుడు తీస్తారు?'

జాప్రూడర్ 'చో' కొట్టి సవరించు కుంటూ నీరసంగా, 'అసలు నేను చాలా పొట్టి! దగ్గిరికివెళ్ళే అవకాశం దొరుకు తుందా?' అన్నాడు.

'కింద అంతగుంపు ఉండదు!' అన్నది ఆమె. అతను సందేహించటం చూసి, 'ఊ! తొందరగా వెళ్ళిరండి! ఇరవయి నిముషాలు కూడా కాదు!' అని పురమాయించింది.

అతను గబగబ లిఫ్ట్‌వయిపు కెళ్ళాడు. అప్పుడు ఉదయం 9—23 గంటలు.

(ఇంకా వుంది)



# సంకల్ప వికల్పాలు

భీశెట్టి లక్ష్మణరావ్

అందరిలాగే నాకూ, రమణకూ 'పెళ్ళ' యింది.

పవిత్రమైన యీ రెండక్షరాల శబ్దానికీ ముడవడిన జంట, నిత్యకళ్యాణం పచ్చ తోరణంగా జీవితాన్ని పూలపాన్పు చేసుకుంటా రన, ఊహ తెలిసిన నాటినుంచీ—నేను రూపకల్పన చేసుకుంటున్న ఒక సుమధుర స్వప్నమే—యీ 'పెళ్ళి'.

అలసి ఆఫీసునుంచి వచ్చే నేను, పొగలు గక్కే వేడి వేడి కాఫీని సేవిస్తూ, రేడియో పెట్టుకొని శ్రీమతితో సరాగాలు ఆడుకోవాలనీ, సాయం సమయంలో కృష్ణా బారేజీ మీద వాహ్యాళి చేస్తూ కృష్ణ వంపుల్ని చూస్తూ ఆనంద తరంగాల్లో తేలి పోవాలనీ, శ్రీమతి వళ్ళో పడుకొని చక్రాల్లాంటి, అందమైన ఆమె కళ్ళల్లోకి చూస్తూ జీవితమంతా హాయిగా గడిపెయ్యాలని—ఏవేవో వూహలతో—పిచ్చిగా—ఎదలో తీయని భావాలగానూ అల్లుకున్నాను.

కాని......!

పెళ్ళిరోజే నా కలలు కరిగిపోయాయి. ఊహలూ, ఆశలూ అన్నీ తారుమారై పోయాయి.

అనుకున్న కట్నం, పూర్తిగా మామగారు సర్దుబాటు చేయ్యలేకపోయారు. పెళ్ళిలో చదివిస్తానన్న రేడియో, ఫాన్, సైకిల్ — వాయిదా పడింది.

నాన్నగారికి మండిపోయింది. అందులోనూ ఆయన రిటైర్డ్ ఆఫీసరేమో—పెళ్ళికి ముందు అనుకున్న మాటలకూ, పెళ్ళిలో జరిగిన తంతుకీ, పొంతన కుదరకపోవడంతో... ఒక్కసారి అవమానంతోనూ, కోపంతోనూ విజృంభించిపోయారు.

'కోపగించుకోకండి బావగారూ! మా మానంతోనే పెళ్ళి జరిగి తీరాలని మీరు పట్టుబట్టడంవల్ల, 'సరే' ననక తప్పింది కాదు. అదీగాక, భగవంతుడెందుకో మమ్మల్ని చిన్నచూపు చూశాడు. అంతెందుకు? ఒక వారం—లేదా—పదిరోజులు గడువివ్వండి. చాలు, మిగతా కట్నంతోపాటు అల్లుడిగారి లాంఛనా లన్నీ సక్రమంగా జరిగే ఏర్పాట్లు చేస్తాము...' అంటూ మామగారు కన్నీళ్లతో—కరుణాత్మకంగా ప్రాధేయపడుతుంటే, మాట తప్పితే ఒప్పని చండశాసనుడైన నాన్నగారు, ఏమాత్రం చలించ లేదు.

'చాల్చాల్లేవయ్యా! చేసింది చాలక యింకా నమ్మమంటున్నావా? తాంబూలాలిచ్చుకునేటప్పుడు పెద్దలముందు ఏలా మాటలు జరిగాయో, చచ్చినట్టు అలా అమలు జరిగి తీరాల్సిందే...! ఏదో ఆడపిల్లల తండ్రివిగదా అని కనికరించి, కట్నానికి కూడా అధికంగా పోకుండా నీ మాట ప్రకారం నడుచుకున్నందుకు సరైన శాస్తి చేశావు. అంత తూగలేనివాడివి ముందే చెప్పుకోవాలి. కానీ పదిమందిలోనూ మమ్మల్నింత అవమాన పరుస్తావా...? ఇలాంటి బెదిరింపులకు నేనేమీ లొంగేవాణ్ని కాదు. మర్యాదగా, మిగతా కట్నంతోపాటు, అబ్బాయికి పెడ్తామన్న— రేడియో, ఫాన్, సైకిల్ తీసుకొచ్చినప్పుడే అమ్మాయిని కాపురానికి పంపించండి. లేదా మీ యిష్టం. నాదగ్గర మాటంటే మాటే....' అంటూ నిష్కర్షగా చెప్పేశాడు.

తర్వాత—[illegible] [illegible], [illegible] నచ్చజెప్పినా నాన్నగారు వినేమిరా ఒప్పుకోలేదు.

అసలు ఆయనగారి మనస్తత్వమే అంత! పంతం వస్తే మటుకు అంతు తేల్చిందాకా వదిలడు!

కొన్ని క్షణాలవరకు, అతిశోభాయమానంగా వెలిగిపోతోన్న నా ఎదలోని భావాల గూడు—నా నూరేళ్ళపంట — అనుకోని విధంగా జరిగిన ఆ హఠాత్పరిణామానికి, తూట్లుపొడిచినట్లు ఒక్కసారి కుప్పకూలిపోయింది.

హతాశుణ్ణై, అశక్తతతో చూస్తూ వుండిపోయాను.

కలలు చెదిరిపోయి, కంటతడిబారిన మనస్సుతో శోకదేవతామూర్తిలా తల్లిదండ్రుల వెంట తరలిపోతున్న నా భార్య రమణను చూస్తుంటే హృదయం భారమై వెయ్యి చెక్కలైనట్లయింది. మూగబాధతో మనసు కొట్టుమిట్టాడిపోయింది. నాన్నగారి పట్టుదలకెందుకో—కట్టలు త్రెంచుకొచ్చింది కోపం! ఒక్కక్షణం తటపటాయించి, గబగబా ఆయన గదిలోకి వెళ్ళాను.

'వారం రోజులు గడువిప్పిస్తే అన్నీ సర్దుబాటు చేస్తామంటున్నారుగా! అంతలోనే ఎందుకు నాన్నా మీకింత పట్టుదల? కాస్త కూడా కరుణలేని హృదయమా మీది...' అంటూ—నాలుగు దులిపెయ్యాలనుకున్నాను. కాని, ఎదురుగా ఉగ్రనరసింహావతార రూపంలో కూర్చొనివున్న నాన్నగార్ని చూడ్డంతో—ముచ్చెమటలు పోసి అడగదలచింది ఎప్పుడో మర్చిపోయాను.

'అరేయ్! వరదా! మాకా మాట ప్రమాణం! మా ఒంటే మాట! అది పట్టుదల?' అన్నట్లు మీసాలు మెలేస్తూ, నాన్నగారు గుర్రుగా నావైపు ఓ చిన్నపోజు పారేశాడు.

నాకు కోపంతో అరికాలిమంట నెత్తికెక్కింది. నా బాధ, నా భావాలు ఆయనకు అర్థమై చస్తేగదా...! ఏలా వివరించను? ఏలా నచ్చజెప్పను. ఆయనను చూస్తేనే హడలు నాకు. అయినా మొండిధైర్యంచేసి, మెల్లగా రెండడుగులు ముందుకు వేశాను.

'...అందుక్కాదు నాన్నా! వారం, పది రోజులు గడువిప్పిస్తే అన్నీ సర్దుబాటు చేస్తామంటున్నారు గదా......'

# సంకల్ప వికల్పాలు

'అందుకని నువ్వు వాళ్ళ తరఫున సంజాయిషీ చెప్పడానికి వచ్చావన్నమాట! అదంతా నాకు తెలుసు. నువ్వు నోరు మూసుకొని పడుండు!' అంటూ 'పెళ్ళమంటే అప్పుడే కొమ్ములొచ్చినట్టున్నాయే! తిరిగి చెప్పడం కూడానా! అందులోనూ, నమ్మించి మోసం చేసినవార్ని వెనకేసికొస్తున్నావ్రా...'

'మోసమా......!' షాక్ తిన్నట్టు అడిగాను.

'కాక, అందలమెక్కించారా యిలా పీట కెక్కటం? నువ్వు నిర్ణయించావా? నేను నిర్ణయించానా? పదిమంది పెద్దలూ ఏకమై మరీ స్థిరపర్చారు. ఆవిధంగా పెళ్ళిలో జరగాలా వద్దా అందులోనూ—కట్నం విషయంలో ఎంతో దాతృత్వం చూపించాను. నువ్వెప్పట్నుంచో కోరుకుంటున్న ఆ రేడియో, ఫాన్, సైకిల్ అన్నా కొనిచ్చి, ఈ ముచ్చట తీరిస్తే ఎంత గౌరవంగా వుణ్ణు. అవి పెట్టి మిగతా కట్నం లేదంటే మాత్రం బలవంతం చేస్తామా చెప్పు! అదీ యిదీ గాకుండా మొత్తానికే ఎగనామం పెట్టజూస్తుంటే—యిక దీన్ని మోసంగాక మరేమంటాము...?'

ఏం చెప్పను? నాన్నగారి తప్పు యిసుమంతైనా అగుపించలేదు. ఒప్పుకున్న తర్వాత ఎందుకు ఎగవెయ్య ప్రయత్నించాలి? ఒకవేళ అంత తాహతులేకుంటే ఆ విషయం ముందుగానే చెప్పొచ్చుగదా!

మోసం చేశారు!

నిజమే!

మనసులో ఏదో శంక మొలకెత్తింది. బరువెక్కిన మనస్సుతో—బాధగా గదిలో కొచ్చేశాను. అమ్మ కేకలు వినిపిస్తున్నాయ్:

'గోవులాంటి నా కొడుకుని మోసం చేశారు. శుభమా అంటూ లేక లేక కలిగిన ఒక్కగా నొక్క కొడుక్కి సంబంధమొస్తే ముదముష్టి మూడువేల రూపాయల కట్నానికే—పదిమందిలో మా పరువు మంటగలిపారు. అసలు మొదట్నుంచీ వద్దు మొర్రో అంటే ఆయనగారు నామాట వింటేగా....' రాగాలు తీస్తూ అపసోపాలు పడిపోతోంది అమ్మ.

విరిగిన మనస్సుతో వినలేక అలాగే పక్కమీద కూలిపోయాను.

**పదిరోజులు గడిచాయి:**

అత్త, మామల దగ్గర్నుంచి, రమణ దగ్గర్నుంచి, కబురుగానీ, ఉత్తరంగానీ రాలేదు. దాంతో నాన్నగారి పట్టుదల, కోపం మరింత హెచ్చు మీరిపోయింది.

'చూశావా వరదా! నేననుకున్నంతా అయింది. నువ్వేమో వాళ్ళ మొసలి కన్నీళ్లకు లొంగిపోయి—అన్న ప్రకారం అన్నీ సర్దుబాటు చేస్తారన్నావ్? చూశావుగా ఏమైందో! అసలుత్తరం ముక్కన్నా రాశారేమో చూడు...!'

నిజమే! నాన్నగారు దూరదృష్టితో ఆలోచించే ఆవేళ అంత నిష్కర్షగా మాట్లాడారు.

అయితే తన జీవితం!

ఆలోచనలు ఓ రూపం దాల్చకముందే నాన్నగారన్నారు: 'వాళ్ళ నాటకం ఎంతకాలం సాగుతారో మనమూ చూదాం! వచ్చిందాకా, దాన్నక్కడే...పుట్టింట్లోనే—పడుండనియ్యి. అంతకీ మొండికేస్తే వుండనే వున్నాయి—విడాకులు!'

నాన్నగారు కోపంతో చిందులు త్రొక్కుతూ అరుస్తుంటే—హృదయం పిడిసమ్మెటలతో గుద్దుతున్నట్టు కుంచించుకుపోయాను.

ఎదురైన సమస్యను ఏలా పరిష్కరించుకోవాలో అర్థంకాక, ఏమి చేయడానికీ పాలుపోక—దుఃఖాన్ని దిగమింగుతూ అంతర్గతంగా కుమిలిపోవడంకంటే—మరో గత్యంతరం లేకపోయింది.

'కోడల్ని ఎప్పుడు తీసుకువస్తావు మంగమ్మత్తా' అంటూ ఎవరన్నా అడిగితే చాలు—భారతం విప్పేసేది అమ్మ గంపెడు శాపనార్థాలతో.

వీరి పట్టుదలలూ, పంతాలు మధ్య నలిగిపోతూనే—పైకి సానుభూతితో మాట్లాడుతూ, పక్కపక్కలంట పరిహసించే స్నేహితుల అపహాస్యాలకు తట్టుకోలేక—చివరికి చేసేది కూడా లేక—నాలో నేనే కుంగిపోతుండే వాణ్ణి!

'ఏమోయ్! వరదరాజా! పెళ్ళికి ముందు, మీ అత్తవారేమో, రేడియో, ఫాన్, సైకిల్ కొని పెడ్తారన్నావుగా! ఇచ్చేసినట్టేనా...లేక...యింకా ఆర్డర్లోనే వున్నాయా...?' అని ఒకరంటే—

'అబ్బే! అవన్నీ మనకెందుకు చెప్తాడ్రా!

వాడికి పట్టిన దశకు మనమెక్కడ ఏడిచి చస్తామోనని లోపాయికారిగా 'మనీ' 'కొట్టే' సుంటాడు. ఏమోయ్ రాజా! అంతేగదూ!' అని మరొకరూ—

'హనీమూన్ అజంతా గుహల్లోనా లేక అత్తవారి కొత్త బంగాళాలోనా...?' అని యింకొకరూ—

—ఇలా ఎవరు బడితేవారు ఎకసెక్కాలతో హేళనగా దెప్పిపొడుపు మాట్లాడుతుంటుంటే—మానసికంగా ఎంత అశాంతి పాలయ్యేవాడినో ఎవరికీ అర్థం కాదు!

రాను రాను యీ దెప్పి పొడుపుమాటల ప్రభావం నా మనసుమీద బాగా పనిచేసిందో ఏమో—క్రమేపీ రమణంటే అదో రకమైన విహ్వ భావం—అత్త మావలంటే కోపం, జుగుప్సా ఏర్పడిపోయింది.

నాన్నగారన్నట్టు 'చచ్చిందాకా'—రమణను అక్కడే—పుట్టింటోనే వదిలి వెయ్యాలన్న నిర్ణయానికొచ్చేను.

మూడు నెలలు గడిచాయి!

ఉన్నట్టుండి అత్త, మావల దగ్గర్నుంచి ఉత్తరాల పరంపర ప్రారంభమైంది. ఆలశ్యానికి క్షమించమని కోరుతూ డబ్బు కోసం విశ్వప్రయత్నం చేస్తున్నామని ఒకసారి; అల్లుణ్ణి పంపించమని మరొకసారి, మిగతా కట్నం సొమ్ము యిప్పటిచ్చి, రేడియో, ఫాన్, సైకిల్ నెమ్మదిమీద కొనిస్తామని మరొకసారీ—యిలా ఉత్తరాలమీద ఉత్తరాలు వస్తుండేవి.

నాన్నగారు దేనికీ జవాబిచ్చేవారు కాదు. పట్టీపట్టనట్టు నేనూ ఊరుకునే వాణ్ణి.

'చూశావా వరదా! సునం పంతగించి, దేనికీ జవాబివ్వకపోబట్టే కాళ్ళబేరానికి దిగారు—మీ మావగారు. ఇప్పుడు కనికరించి లొంగితే మళ్ళీ ఎగనామం పెయ్యొచ్చు. మరికొంత బెట్టు చూపిస్తే చచ్చినట్టు తనే వస్తాడు—ఏమంటావ్?'

నాన్నగారి మేధాశక్తికి మనసులోనే జోహార్లర్పించేను. లేకపోతే యింత వాటకమా!

'అవును. ఈ కల్లబొల్లి ఉత్తరాలకే మాత్రం లొంగకూడదు. మనపాలిట శనిలా దాపురించారు — దరిద్రులు. కాకపోతే ఏమిటి! పదవ క్లాసులో పదకొండు సార్లు పల్టీలుకొట్టిన ఆ ఎదురింటి మూర్తి తెచ్చుకున్నాడు—పదివేల రూపాయల కట్నం! వియ్యా పిస్సైన వాకొడుకుని అచ్చటా ముచ్చటా తీర్చని నరక కూపంలోకి చేజేతులా తోసేశాము. కోడలు అందగత్తె—గుణవంతురాలో అని మావాన్నగారు మురిసిపోయారుగానీ...అచ్చట్లూ... ముచ్చట్లూ విషయం ఆలోచించిన పాపాన పోయారా...!' అంటూ అమ్మకసితోనూ, కోపంతోనూ, హైరానా పడిపోతుంటే అనుకోని కోపం అత్తమావలమీద అమాంతంగా వచ్చేసేదినాకు!

అయినా అశక్తుణ్ణి! ఏం చేయను?

అయిదునెలల తర్వాత—

ఒకనాడు—

ఆఫీసు నుండొచ్చేసరికి, లోపలిగదిలోంచి మావగారి మాటలు—విన వస్తున్నాయ్! ఆశ్చర్యంతో గుమ్మం దగ్గరే నిలబడిపోయాను.

'బావగారూ! కాదనకండి! పెళ్ళయినా—ఆర్నెల్లనుంచి పెద్దమ్మాయిని యింట్లో అట్టే పెట్టుకున్నందుకు — ఏం నేరం చేశామనో—మిగతా ఆడపిల్లలకు వచ్చే సంబంధాలన్నీ తిరిగిపోతోన్నాయ్! ఆడపిల్లలు గలవాణ్ణి! కాస్త కనికరించి దయుంచండి! పండక్కి అల్లుణ్ణి పంపిస్తే...'

'ఏం చేయమంటారన్నయ్య గారూ! మాకుమాత్రం లేదూ—కోడలిమీద ఆశ. మీ బావగారు నేనూ, రోజూ శతవిధాలా అబ్బాయికి నచ్చజెప్తూనే వున్నాం. గానీ అబ్బాయి వింటేగా! ఆ పెట్టె లాంఛనాలు సరిగ్గా జరగలేదని—స్నేహితులదగ్గర అవమానంతో తలెత్తుకోలేకపోతున్నాడు—అవి పెట్టేందాకా అమ్మాయిని తీసుకరావద్దని మొండికేసి కూచున్నాడు. అందులోనూ మీరు చేసింది ఏమాత్రం మంచిపనా అన్నయ్యగారూ...' సుతిమెత్తనిమాటలతో అమ్మ మాటిగా అంటిస్తుంటే—

'తప్పేనమ్మా! నేను చేసిందంతా తప్పే! అందుకెంతో క్షమాపణ చెప్పకుంటున్నాను'— అంటూ మావగారు ప్రాధేయపడుతున్నారు.

కథల్లుతున్నాడు.

ఎందుకో పాకదంతా నటనలా అనిపించింది.

పట్న గదిలో కొచ్చేశాను.

రాత్రి భోజనాలదగ్గర నాన్నగారన్నారు 'మరి మీ మావగారేమో పండక్కి పిలవడానికొచ్చారు. నీ అభిప్రాయమేమిటో మీ మావగారిముందు చెప్పరాదూ...!'

'అవున్నాయనా...!'

అభిప్రాయం! ఏమిటి నా అభిప్రాయం? తెలీకే అడుగుతున్నాడా! ఒక్కసారి మావగారి కళ్ళల్లోకి ఎగాదిగా చూశాను. అంతా నాటకం! జవాబివ్వకుండా మౌనంగా తింటూ వుండిపోయాను.

'మళ్ళడిగాడా! మాన్యాలడిగాడా! ఆ పెద్దాయన్న వస్తువులు పెట్టేస్తే అసలు ఏమౌతుందనే యిది వుండదు! ఇప్పటికే అవమానంతో చచ్చినకాడ చస్తున్నాడు. మళ్ళీ అడుగుతారేమండీ!...'

అమ్మది తెలివైన బుర్ర!



# సంకల్ప వికల్పాలు

'బాబూ! వరదరాజూ! నావల్ల పొరపాటే అయింది. అందుకే నాయనా ఆలస్యమైంది. తలతాకట్టు పెట్టయినా నీ ముచ్చట తీరుస్తాను బాబూ! మీ దంపతులు సుఖంగా కాలం గడపడమే నా కోరిక అసింది. అందుకే నాయనా! పండక్కి తీసుకవెళ్లి—ఆ ముచ్చటన్నీ జరిపించి—మీ యిద్దర్నీ కలిపి పంపిద్దామనుకుంటున్నాను. ఇప్పుడొచ్చిందందుకే నాయనా...!'

'ఊఁ హుఁ!'...మాటాడకుండా విర్లిప్తంగా వూరకుండి పోయాను.

'మీరింతగా చెప్పాలా బావగారూ! అంత ప్రాధేయపడ్డ తర్వాత వాడు మాత్రం ఏలా రాకుండా వుంటాడు చెప్పండి...'

'నాన్నా...!'

'పరవాలేదు వరదా! నీ ముచ్చటన్నీ తీరుస్తానంటున్నాడుగా!' అని, 'ఆఁ! చూడండి బావగారూ! మాటంటే వాడగ్గర మాటే! ఈసారి మళ్లీమాట తప్పారంటే—మాత్రం మర్యాద దక్కదు...''

'జరిగిందానికి యిప్పటికే కుమిలిపోతున్నాను బావగారూ! ఇంకా మిమ్మల్ని బాధపెడ్తావా...!'

'సరే! ముందు మీరెళ్లి ఆ ఏర్పాటన్నీ చూడండి! పండగయింకా వారం రోజులుందిగా! లీవుపెట్టి తప్పకుండా వస్తాడు!'

నాన్నగారి నిర్ణయం ఆశ్చర్యమేసింది నాకు. ఏదో ప్లాన్ వేసే అనుంటాడు! చూదాం!

మర్నాడుదయం మావగారెళ్లిపోయారు.

అప్పుడు విడమర్చారు నాన్నగారి ప్లాన్! 'చూశావుగా! అనుకున్నట్టే మీ మావగారు కాళ్ల బేరానికొచ్చారు. గనుక మనం కాస్త పట్టు విడుపులు చూపించడం మంచిది.' అంటూ అవి—'మరీ లోబడి పొమ్మనిగాదు నేను చెప్పేది' అన్నారు.

'అంటే!' అర్థంకాక అడిగేను.

'ఆఁ! ఏమీ లేదు. మనకా మిగతా కట్నం సొమ్ము ఆ వస్తువులు సక్రమంగా సంక్రమించాలంటే తప్పితంగా నువ్వు పండక్కి వెళ్లితీరాలి...'

'ఆఁ!'

'అవును సాంప్రదాయం ప్రకారం సంక్రాంతి రెండుమూడురోజుల ముందుగా అల్లుణ్ణి అత్తవారు తీసుకవెళ్లడం సహజం! అయితే నువ్వుమాత్రం — వాళ్లని కొంచెం ఏడిపించడం కోసం—సంక్రాంతిరోజునే బయలుదేరాలి. వెళ్లి, ఎవరితోనూ సరిగ్గా మాట్లాడకూడదు. ఆఖరికి నీ భార్యతోకూడా! పెట్టే ప్రతీదాంట్లోనూ వంకలు ఎంచాలి. వీలున్నంతవరౌనం — ముభావం పాటించాలి. నీవెంట ఒకటికి పదిమార్లు తిరిగేలా తిప్పించుకోవాలి. ఇవన్నీ పాటించినాడే—అల్లుడిగారి అలకతీరలేదని గ్రహించి పనులు తొందరగా చేస్తారు. అన్నీ సమకూర్చినా యింకా పెట్టవలసిందేదో మిగిలిపోయినట్టుగానే ప్రవర్తించాలి...'

—నాన్నగారు పూర్తిచేయకముందే అమ్మ అందుకుంది: 'అవును బాబూ! తీరా అక్కడికెళ్లాక యింకా ఎంతనాటక మాడుతారో ఏమో! నువ్వు బెట్టుసరి చూపించకపోతే మనకు మిగిలేది — అవమానమూ, తొంటిచెయ్యిమాత్రమే! మీ నాన్నగారింత పట్టుదల చూపించబట్టేకేగదా — మీ మావగారొచ్చేరు.' అంటూ, 'నీ పెళ్లికోసం మీ నాన్నగారూ, నేనూ ఎన్నో కలలు కన్నాం. కానీ! వాళ్లు మన ఆశలన్నీ అడియాసలు చేశారు బాబూ! అందుకే...'

అమ్మగొంతు ఆర్ద్రమైంది. కనుకొనల నుంచి అశ్రువులు రాలిపోతున్నాయ్!

'చేస్తారు మోసం! చూదాం!' అప్రయత్నంగా నానోటంట కసిగా వెలువడ్డాయా మాటలు! పిడికిలి బిగుసుకపోయింది.

'అవును వరదా! మోసాన్ని మోసంతోనే జయించాలంటారు. మనమేమన్నా అన్యాయంగా వాళ్లను పీడిస్తున్నామా చెప్పు!— పదిమందిలో అనుకున్నమాటలేగా! ఆవేళ ఖండితంగా అడిగాను — అన్నివిషయాలు. ఎంచక్కా ఒప్పేసుకున్నారనుకున్నావ్? మీ అమ్మ అసలు యీ సంబంధం ఒద్దంటున్నా—నేనే...'

—నాన్నగారి వ్యథాపూరితమైన పలుకులు వింటూంటే శరీరం ఒక్కసారి కుతకుతలాడిపోయింది.

'పోనీ, జరిగిందేదో జరిగిపోయింది. ఈ కట్నాలూ—లాంఛనాలూ ఎందుకు, కోడల్ని తెచ్చుకుంటే పోలా అనుకుంటె — యీ లోకులు మనల్ని బ్రతకనిస్తారా బాబూ! ఊగల్లా మూగుతారు. గుసగుసలతో మనల్ని బజారు పాలుజేస్తారు. నీ వెంతగానో ఆశించిన

...జీ యిలా అటుగుంటి పోవడం వల్ల నీకు మాత్రం మనశ్శాంతి వుంటుందా? అందుకే నాయనా యీ పంతాలూ...పట్టుదలలూ...'

నిజమే!

'గజిబిజిగా పేరుకపోయిన ఆలోచనలతో బుర్ర వేడెక్కి పోయేది. కృష్ణా బారేజీ దగ్గరకుపోయి గంటలతరబడి గడిపేసేవాణ్ణి! మురిపాలతో ముద్దిడుకుంటూ, ముందుకు సాగిపోయే కృష్ణ వంపుల్ని చూస్తుంటే—రమణ గుర్తొచ్చేది.

బాధగా యింటికి మరలేవాణ్ణి!

అనుకున్న సంక్రాంతి వచ్చేసింది!

మావగారూ రెళ్ళి మళ్ళీ ఉత్తరం రాశారు. అదే సోది: నన్ను పంపించమని.

వెళ్ళాక ఏం జరగబోతోందో—భవిష్యత్తు ఎలా పరిణమించబోతుందో — అన్న ఆలోచనలతో గుండెల్లో అరణ్యాలు మండి పోతోన్నాయ్! వెళ్ళక తప్పదు! పరిష్కారం కావాలి! మళ్ళీ మోసంచేస్తే...! అవమానంతో యింకేమన్నా వుందా...!— పళ్ళు బిగుసుకపోయాయి. అలా జరగకూడనిదే జరిగితే, శాశ్వతంగా స్వస్తి చెప్పెయ్యాల్సి! విడాకులు!

మనసు స్థిరత్వాన్ని కోల్పోయింది. గజిబిజిగా ఆలోచించేస్తోంది. మనోధైర్యం సన్నగిలుతున్న తరుణంలో—నాన్నగారి కడసారి హెచ్చరికతో మా యిద్దరి అభిప్రాయాలూ ఒకటయ్యాయి. ఏనుగు బలమొచ్చేసింది నాకు.

బిగ్గరగా కూసిన ఇంజను కూతకు—అంతవరకూ గతంలోకి పయనిస్తోన్న నేను—ఒక్కసారి త్రుళ్ళి పడి యీలోకంలో కొచ్చి పడ్డాను. రైలుసాగిపోతూనే వుంది.

* *

పండగపూటా, యిటు కన్నవారింటికీ, అటు అత్తవారింటికీ 'చెందకుండా' యిలా ఏకాకిగా రైల్లో ప్రయాణం చేస్తున్నాను... నాలుగు గంటల లేటుతో బోరెత్తిపోయింది రైలు ప్రయాణం! ఉస్సూరు మంటూనే దిగాను. స్టేషనుకు మావగారొచ్చారు. చూసీ చూడనట్టు ముఖం తిప్పుకున్నాను. రిక్షా ఎక్కాం. ఆ పల్లెటూరులో రోడ్లంటూ, సందులంటూ రిక్షా వెళ్ళడమే మహా యాతనై పోయింది. వీధి దీపాలు వెలిగేయి, మినుకు మినుకులాడుతూ. నిర్మానుష్యంగా వెల వెల బోతోంది—రహదారి! ఆకసంలో చిన్న చిన్న నక్షత్రాలు అప్పుడే పొడచూపుతోన్నాయ్! మధ్య మధ్య మావగారేదో అడుగుతూంటే—ఏదో విసుక్కుంటూ, చెప్పీ చెప్పనట్టూ జవాబులు చెప్తూ, ముభావంగా వుంటూ వచ్చేను.

దాదాపు గంటన్నర తర్వాత—రిక్షా యింటిముందాగింది. బాగా చీకటిపడింది. అయినా, పైన చంద్రుని కాంతిలో అన్నీ స్పష్టంగా అవుపిస్తోన్నాయ్! మున్సిపాలిటీ వీధిలైట్లు మాత్రం మసకబారి వెలుగుతున్నాయ్!

మావగారిని అనుసరిస్తూ గడపలో అడుగుపెట్టేను. చుట్టూ పరికించి చూశాను. కమ్మరిల్లు. ఎలక్ట్రిసిటీ లేదు. గోడలకు తగిలించివున్న కిరసనాయిలు బుడ్డి దీపాలుమాత్రం చీకటితో పోరాడుతున్నాయ్! వాతావరణం గంభీరంగా వుంది.

'పాడుమేళం' ఎలక్ట్రిసిటీ కూడా లేదు. బాధతో కసిగా ముసిరింది—మనసు' ఆనాడు—మొదటిసారిగా పెళ్ళిచూపుల కొచ్చినపుడు—యివన్నీ చూడాలనిగానీ, పట్టించుకోవాలనిగానీ గుర్తుంటేగా...పల్లెటూరి వాతావరణం హాయిగా ఉంటుందనుకున్నాను! అందులోనూ రమణను చూశాక—అదో రకమైన మైకంలో పడిపోయాను.

గడపలో అడుగు, లోపల పెట్టానో లేదో—లోపలినుంచి ఒకటే దగ్గులూ, మూల్గులూ ఘోరంగా వినవస్తోన్నాయ్! అలాగే నిలబడిపోయాను.

'పదబాబూ! నీ అత్తగారికి ఆరోగ్యం బాగోలేదు! అందులోనూ, నెలరోజుల్నుంచి మరీ ఎక్కువైంది!'

'రోగిష్టి యిల్లు!' — అనుకుంటూనే లోని గదిలోనికి అడుగుపెట్టేను.

'అమ్మా! బావే! బావొచ్చాడు!' అంటూ పదేళ్ళ మరదలు నా ముందునుంచి చెంగున ఎగురుకుంటూ, గబగబా వాళ్ళమ్మ వుంటున్న గదికేసి పరుగెత్తింది.

బట్టలుమార్చుకొని, నూతిదగ్గర తోడి పెట్టిన వేన్నీళ్ళ స్నానం చేస్తోంటే—టవల్, పంచి, అందించడానికి రమణ వొచ్చింది. చూసీ చూడనట్టే తేరపార జూచాను. పైనుంచి విరజిమ్ముతోన్న వెన్నెల కాంతిలో అప్సరసలా వెలిగిపోతోంది—రమణ! ఆమెలో అంతటి సహజసౌందర్యమున్దని అదివరకు నేనెన్నడూ ఊహించలేదు. కళ్ళనుద్దుకుంటూ, మరొకసారి చూశాను. 'అబ్బా! నా రమణ యింత అందమైందా!' మనసు పరవశించి, ప్రఫుల్లమైనట్టయింది. 'రమణా!' ఆప్యాయంగా—అనురాగంగా పిలవబోయాను.

'జాగ్రత్త! వరదా!' కళ్ళముందు నాన్నగారి ఉగ్రస్వరూపం. ఒక్కసారి తుళుక్కుమంది. చటుక్కున ముఖం తిప్పేసుకున్నాను. అందిస్తోన్న టవల్ని లాక్కొని గబగబా గదిలో కొచ్చేశాను. రమణ లావణ్యరూపం మాత్రం నా కళ్ళల్లో సజీవంగా అలాగే ప్రతిష్ఠించుకపోయింది.

విస్తరిముందు కూచున్నాను!

'పండగకో మూడురోజులు ముందుగానే వస్తావని—నేనూ, నీ అత్తయ్యా ఎంతో సంబరపడ్డాం బాబూ! నీ ఉత్తరం రాసింది లగాయతు, రోజూ స్టేషనుకీ, యింటికీ తిరగడంతోనే సరిపోయింది నా పని! ఆc! అవన్నీ యిప్పుడెందుకులే నాయనా! ఏలాగో వచ్చావు. అదే పదివేలు! భోంచేయి నాయనా!' అంటూ 'వంటలో మా రమణది, అందరూ అమృత హస్తమంటుంటారు బాబూ...!' మావగారు చెప్పుకుపోతోన్నారు.

త్రుళ్ళిపడ్డాను. ఆకలివేత పెట్టిన పదార్థాలన్నీ గబగబా భోంచేసేస్తోన్నానన్న సంగతి అప్పటికిగానీ గుర్తుకురాలేదు. నెమ్మదిగా, కడుపులో కరకరలాడుతోన్నా — యిష్టం యిష్టంగా తింటున్నట్టు వుండిపోయాను.

'అదేమిటి నాయనా! అలా ఆలోచిస్తూ వుండిపోయావు. ఇవన్నీ నీ కోసం చేసినవే! భోంచేయి బాబూ!'

'ఆకలిగాలేదు!'— పైకి లేచిపోయాను, అలకగా!

'బావా! అమ్మ పిలుస్తోంది! రండి' అంటూ పదమూడేళ్ళ మరో మరదలు గబగబా వచ్చి చెప్పింది:

'వంటల్లో బాగోలేదని చెప్పు!' అనబోయి, 'ఏమో! రేడియో, ఫాన్, సైకిల్—కట్నం విషయాలు చెప్పడానికి గాబోలు' అనుకొని, 'పద' అంటూ ఆ అమ్మాయిని అనుసరించాను.

జీవం లేని శవంలా మంచం మీద పడుకొని, ఊపిరాడనివ్వని దగ్గుతో యమయాతన పడిపోతోంది—అత్తయ్య. రమణ, మందుపట్టడం పూర్తిచేసే వరకూ గుమ్మం దగ్గరే నిలబడిపోయాను.

'వచ్చావా బాబూ! రా కూర్చో నాయనా!' మందుత్రాగాగ, సేదతీర్చుకొని అంది

( 64వ పేజీ చూడండి )







అమానుషమైన శక్తి కలవారే అవతారపురుషులనీ, మహనీయులనీ జనుల భావన.

మతప్రవక్తలందరూ అద్భుతశక్తులు కలవారనే వాడుక లోకంలో అనాదినుంచీ ఉన్నది.

అవి గౌతమబుద్ధుడు మత ప్రచారం చేసేకాలం.

ఆయన ఎక్కడకు వెళ్ళినా సరే, జనులు తండోపతండాలుగా వచ్చి ఆయన దర్శనం చేసుకుని, ఉపదేశాలు విని కృతార్థులైనట్లు భావిస్తారు.

ఆయనవద్ద అపూర్వశక్తులున్నాయని ప్రజలు చెప్పుకుంటారు. కాని, ఆయనను చూడగానే లౌకికాభిలాషలు నశించి పరమార్థదృష్టి మాత్రమే ఏర్పడుతుంది.

ఒకప్పుడు బుద్ధదేవుడు కపిలవస్తు సమీపంలోని ఒకపల్లెటూరికి వచ్చాడు. ఊరి పొలిమేరలో ఉన్న ఒక తోటలో బసచేశాడు. జనం గుంపులు గుంపులుగా పోయి ఆయన పాదాలకు మొక్కి జన్మ చరితార్థమైనట్లు సంతోషిస్తున్నారు.

నాడు ఆ గ్రామంలో ఒక దుస్సంఘటన జరిగింది.

ఒక కుటీరంలో ఒక యువతి దీనాతిదీనంగా విలపిస్తున్నది. ఆమె యేకైక పుత్రుడు—అయిదేండ్ల బిడ్డ నాటి ప్రాతః కాలమే మరణించాడు. ఆ బిడ్డను ఒడిలో పెట్టుకొని కన్నీరు కాల్వలు కట్ట ఆమె విలపిస్తున్నది.

ఆమె ఏకాకిని, 'నా' అన్న వారెవ్వరూ లేరు.

ఇరుగుపొరుగులవాళ్ళు వచ్చి చూచి 'పాపం!' అని విచారిస్తూ వెళ్ళిపోతున్నారు.

ఆమెను ఊరడించడం ఎవ్వరికీ సాధ్యం కాలేదు.

ఒక వృద్ధురాలు — ఇరుగామె వచ్చి, ఆమెకు దగ్గరగా కూర్చుని 'అమ్మాయీ! నువ్వు దుఃఖించకు. బుద్ధదేవుడు మన అదృష్టం కొద్దీ ఈ రోజు ఈవూరు వచ్చాడు. ఊరిబయట తోటలో ఉన్నాడట! ఆయన సాక్షాత్తు దేవుడే! గొప్ప మహత్తు కలవాడు నాకు బాగా తెలుసును. చచ్చిపోయినవారిని ఆయన బతికించగలడు. నీవు మారుమాటాడకుండా ఈ బిడ్డను తీసుకుని ఆయనదగ్గరకువెళ్ళి అతని పాదాల మీద పడవేసి బ్రతికించాలని ప్రార్థించు. ఆయన కరుణిస్తే సరి, నీకోరిక నెరవేరుతుంది' అని చెప్పింది.

వెంటనే ఆ యువతి మృతశిశువును భుజంమీద వేసుకుని బుద్ధభగవానుని వద్దకుపోయి, ఆయనపాదాలదగ్గర పుత్రుని కళేబరాన్ని పడవేసి 'భగవన్! ఈ బాలుణ్ణి బ్రతికించి, నా ప్రాణాలు నిలుపు తండ్రీ! అనాథను, నీవు కరుణిస్తే అసాధ్యకార్యాలు సులభంగా నెరవేరుతాయి. ఈ బిడ్డకు ప్రాణాలు పొయ్యి, తండ్రీ!' అని విలపిస్తూ ప్రార్థించింది.

భగవానుకి విషయమంతా అవగతమైంది.

తాను అపూర్వశక్తులూ, మహత్తు కలవాడని ప్రజల నమ్మిక అని అతనికి తెలుసు. ఒక్కమాటలో తన సామాన్య వ్యక్తిత్వాన్ని తెలిపి, ఆమెకు నిరుత్సాహం కలిగించి, దుఃఖంలో ముంచివెయ్యడం బుద్ధుని కిష్టంలేదు. భగవానుడు ప్రశాంతంగా 'అమ్మా! నీ పుత్రుని తప్పకుండా బ్రతికించగలను. దానికో ఉపాయంఉంది' అన్నాడు.

'చెప్పండి స్వామీ, చెప్పండి. నాబిడ్డ కోసం నిప్పులలో ఉరకమన్నా ఉరుకుతాను; కత్తులమీద నడవమన్నా నడుస్తాను' అని ఆ యువతి ఆతురతతో అన్నది.

అంత కష్టమైన పనేమీ కాదమ్మా! తెల్ల ఆవగింజలు కొంచెం సంపాదించి తేవాలి. వాటిని మంత్రించి నీ బిడ్డపైని చల్లితే సరి, బ్రతుకుతాడు.' అన్నాడాయన.

'ఇదెంతలో పని? వేగంగానే తెస్తాను' అని ఆమె ఆతురతో లేవబోయింది.

'తొందరపడకమ్మా! నిదానంగా విను. మీయింట్లోని గింజలు పనికిరావు అంగడిలో కొని తేకూడదు. ఎవరి యింటినుంచైనా తీసుకురావాలి'

'అలాగే తెస్తాను స్వామీ''

'ముఖ్యమైన విషయం ఒకటుంది నీవు ఎవరి గృహంనుండి ఆవగింజలు తెస్తావో, ఆయింట్లో ఇదివరకు ఎప్పుడూ ఎవరూ మరణించి ఉండకూడదు.'

'సరే' నంటూ ఆ యువతి ఊళ్లోకి పోయి ఒకయింట తెల్లావాలు అడిగింది. వారున్నూ ఇయ్యడానికి సిద్ధపడ్డారు. ఆమె 'మీయింట్లో ఇంతవరకూ ఎవ్వరూ మరణించలేదుగదా?' అని అడిగింది. ఆ నడుమనే ఎవరో పోయినట్లు వారు చెప్పారు. వెంటనే ఆమె అక్కడినుంచి మరోయింటికి పోయింది. ఆయింట్లో సంవత్సరం కిందట గృహయజమానే మరణించాడట. ఆమె

( 64వ పేజీ చూడండి)

శ్రీమతి పరిమళాసోమేశ్వర్

# ప్రేమ వివాహాలు - పెద్దల బాధ్యత

'ప్రేమ వివాహం' అనగానే ఉలికి పడతారు మనదేశంలో ప్రతి ఒక్కరూ— అదేదో అపూర్వమైన విషయమైనట్లు. ఫలానా అబ్బాయి ఓ అమ్మాయిని 'లవ్ మేరేజ్' చేసికొన్నాడనగానే యువతరంలో చాలామంది అసూయపడినా కనీసం కొందరైనా లోలోపల ఆ అబ్బాయి ధైర్యాన్ని, అదృష్టాన్ని మెచ్చుకోక మానరు. ఆ మెచ్చుకోలును పైకికూడా వెల్లడిచెయ్యగల నైతిక ధైర్యం ఉన్నవాళ్లు చాలా అరుదనుకోండి. అది వేరే విషయం.

ఇక పెద్దల్లో మాటికి తొంభైమంది యిలాటి వాళ్లను లోలోపలా, పైకి కూడా అసహ్యించుకుంటారు. చాలా తక్కువ మంది 'ఈ కాలమే యిలా మండిపోతోంది. వీళ్లనని ఏం లాభం?' అంటారు నిర్లిప్తంగా. చివరకు యిలాటి వివాహాలను ప్రోత్సహించే పెద్దలు కనీసం పాయింట్ వన్ పర్సెంట్ కూడా లేరంటే అతిశయోక్తి కాదు. ఒక వేళ తమకు దగ్గర సంబంధంలేని వాళ్లను ప్రోత్సహించినట్లు కన్పించినా తమ పిల్లల విషయం వచ్చే సరికి పాతకాలపు అలవాట్లనే పట్టుకు వేలాడతారు.

ఏది ఏమైనా 'ప్రేమ వివాహం' అన్న పదం ఓ పెద్దదుమారం లేవదీస్తుంది ప్రతి ఒక్కరిలోను. దీనికి చాలా కారణాలున్నయ్. అందులో ఒకటి యీ పదానికి చెప్పుకునే అర్థం సరియైనది కాకపోవటమే. ప్రేమ వివాహమనగానే మన వాళ్ల ఉద్దేశ్యప్రకారం పెద్దల అంగీకారం, అనుమతి లేకుండా జరిగిన పెళ్లి అని అర్థం. కాని ఈ అర్థం సరి అయినది కాదు. ఇలాటి వివాహాలు పురాణకాలంలో పెద్దల అనుమతితోకూడా జరిగిన ఉదంతాలు చాలా ఉన్నయ్. వధూవరుల పరస్పరాంగీకారంలో జరిగే యిలాంటి వివాహాలను 'గాంధర్వ వివాహ' మనే వాళ్లు. అలాంటి విషయాలు పురాణాల్లో, కావ్యాల్లో, ఉంటే తన్మయత్వంతో చదివి ఆనందించే మనపెద్దలు తమ కడుపున పుట్టిన పిల్లలే అలా చేస్తుంటే ఆముదంతాగిన మొహాలు పెడ్తేస్తారు.

ఇదంతా ఎందుకు జరుగుతోంది? ఈ రోజుల్లో పెద్దవింత 'హిపోక్రిట్స్'గా ఎందుకు తయారవ వలసివస్తోంది? (ఇక్కడ పెద్దలంటే పెళ్లిడుకొచ్చినపిల్లలు గల తల్లిదండ్రులని నా అర్థం) అలా ఆలోచిస్తే మొట్టమొదటిగా స్ఫురించే విషయ మేమంటే తరతరాలుగా వస్తున్న ఆచారాలను, మూఢనమ్మకాలను వదిలిపెట్టలేని భారతీయుల బలహీనత!

ఏవో కారణాలచేత మనదేశంలో బాల్య వివాహాలు అమలులోకి వచ్చినయ్. బాల్య వివాహాలుజరిగే ఆ రోజుల్లో పెద్దలే వధూవరుల బాగోగులన్నీ ఆలోచించి పెళ్లిళ్లు జరిపే వారంటే కొంత అర్థం ఉంది. కాని యిప్పటికీ పాతికేళ్లొచ్చిన పిల్లల పెళ్లి విషయమై తమ నియంతృత్వం చూపాలని పెద్దలు భావించటం అన్యాయం.

ఒకవేళ సాహసించి కొందరు పిల్లలు తమకిష్టమైనవారి నెన్నుకొని చేసికొంటే తమ 'పెద్దతనానికి భంగంకలిగినట్లు భావిస్తారు చాలామంది తల్లిదండ్రులు' అలాటి వారు గ్రహించవలసిన విషయమేమంటే అన్ని విషయాల్లోలానే తల్లి దండ్రులకీ, పిల్లలకూ మధ్యగల అనుబంధాలకు కూడా 'హద్దనేది ఉందన్న సంగతి' వాళ్లు మర్చిపోకూడదు. వయసొచ్చిన పిల్లలలో తల్లిదండ్రులు తమ ఆనందానికి, స్వేచ్ఛకు నిరోధకులని ఎప్పుడైతే అభిప్రాయం పడిపోయిందో అప్పుడు వారిని గౌరవించటం కూడా మానేస్తారు. అందుకే తమ గౌరవాన్ని నిలబెట్టుకోదల్చిన పెద్దలు ముందుగా తమ పిల్లల వ్యక్తిత్వాన్ని గౌరవించటం నేర్చుకోవాలి.

ఇదంతా ఏదో అభ్యుదయభావాలు కల యువతరాన్ని ఉర్రూత లూగించటానికి కాదు నేను వ్రాస్తున్నది. నేడు సంఘాన్ని పీడిస్తున్న కట్నాల సమస్య, నానాటికీ స్త్రీలలో పెరుగుతున్న అవివాహితల సంఖ్య నశించి పోవాలంటే ముందుగా పెద్దలలో చైతన్యం రావాలి. ఈ కాలం యువకుల్లో

## డాక్టర్ కబుర్లు

### తొందరపడకండి!

పిల్లలు నడవటం నేర్చుకోటానికి ఆలస్యం అవుతున్నదని కంగారు పడకండి! తొందరపడి మీ బిడ్డని నడిపించకండి!! కాళ్లు వంకర పోవచ్చు.....

చిన్న పిల్లలు తమంతట తామే నడవటం నేర్చుకుంటారు. వారికి ఇష్టం వచ్చినప్పుడే వాళ్లని నడవనివ్వాలి. అంతదాకా పాకనివ్వవచ్చు!

కొందరు నడిపించేందుకు బళ్ళు లాంటి వాటిని వాడుతూ ఉంటారు. ఇవి అంత మంచివి కావు.

తొందరపడి నడిపిస్తే చిన్న పిల్లల కాళ్లు వంకర పోవటమే కాక వాళ్లకి మానసికంగా కూడా హాని కలుగువచ్చు. వాళ్లు ఆందోళనకి లోనవవచ్చు. ఇది మంచిది కాదు. "వంకరకాళ్లు సరిగ్గా అయిపోవచ్చు కాని మనస్సుకి తగిలిన



దెబ్బ నయమవుతుందో లేదో?" అన్నాడొక పెద్ద వైద్యుడు.

హెచ్. ఎల్. పార్సన్స్
(కాపీరయిటు)

అమూల్ నుంచి **క్రొత్త** పదార్థము!

# అమూల్‌స్ప్రే

## ప్రోటీన్లు అధికంగాగల బేబీ ఫుడ్




ఏ ఇతర పాల ఆహారంలోను
శరీర నిర్మాణ ప్రోటీన్లు
ఇంతకు మించి లేవు!





**20 సెకండ్ల లోపుగా కరుగుతుంది...సులభంగా జీర్ణమవుతుంది!**

బిడ్డ తన మొదటి రెండేళ్లలోను బరువును నాలుగు రెట్లు అధికం చేసుకుంటూ త్వరగా పెరగాలి. ఇందుకు ఆధారమైన ప్రోటీన్ అమూల్‌స్ప్రే నుండి లభిస్తుంది. దీనిలో విటమిన్‌లు, ఇతర మంచి పదార్థములు కూడ వున్నాయి.

అమూల్‌స్ప్రేలో విటమిన్‌లు వున్నాయి. కార్బొహైడ్రేట్స్, క్రొవ్వు పదార్థములు, లోహపదార్థములు తదితర పోషకత్వపు పదార్థములు కూడ సరితూక మిశ్రమముగా వున్నాయి. నియాసిన్, సోడియమ్ అయొడైడ్, ఫోలిక్ ఏసిడ్ సహజ స్థితిలో వున్నాయి.

**సులభంగా జీర్ణమవుతుంది**

అమూల్‌స్ప్రే, యూరప్, యు.ఎస్.ఏ.లలో చేసే ఉన్నతమైన 'స్ప్రేడ్రైయింగ్' పద్ధతి ప్రకారం చెయ్యబడుటచే బాగా జీర్ణమగుటయే గాక పాలలోని ప్రోటీన్ యొక్క విశిష్టత, ఉత్తమత్వము ఉన్నతస్థితిలో వుంచబడతాయి.

**అద్భుతంగా కరుగుతుంది**

పేస్టు చెయ్యనవసరం లేదు. కావలిసిన వేడి నీటిలో అమూల్‌స్ప్రేను బాగా కలపండి. 20 సెకండ్ల లోపుగా మీ బిడ్డకు పాలు తయారవతాయి! పాలపీక అడ్డుకు పోదు.

**మీ బిడ్డకి తగినది అమూల్‌స్ప్రే**



అమూల్‌స్ప్రే మీకు
500 గ్రాముల డబ్బాలు
(1 పౌనుకు పైగా
46 గ్రాములు)లో లభిస్తుంది

*ASP/AS-1/67-TL-R*

ఏకైక డిస్ట్రిబ్యూటర్‌లు: వాల్టాస్ లిమిటెడ్

కెయిరా డిస్ట్రిక్ట్ కోపరేటివ్ మిల్క్ ప్రొడ్యూసర్స్ యూనియన్ లిమిటెడ్ ఆనంద్‌చే తయారు చెయ్యబడినది
మద్రాస్, కేరళ, ఆంధ్ర స్టేట్‌లలో పంపిణీ చెయ్యబడుతోంది.

పోతే; మానవత్వం నశించిపోయినవని; అందుకే ఆడపిల్లల పెళ్ళిళ్ళు జటిల సమస్య అయిపోయిందని అంటారు చాలా మంది. కాని యీ వాదన పూర్తిగా నిజంకాదు.

ఆడపిల్లల తండ్రులలో రెండు రకాలున్నారు. ఒక రకంవారు తాము అల్లుడిని ఎంత డబ్బుపెట్టి కొంటే అంత ప్రొఫెసర్షనేట్‌గా తమపేరు ప్రఖ్యాతులు యినుమడిస్తాయని భావిస్తారు. ఇది డబ్బున్న జాతి. ఇలాటివారి శాతం చాలా తక్కువ మనదేశంలో. పోతే అధిక సంఖ్యాకులు, నేటి సాంఘిక పరిస్థితులకు ఎక్కువగా బలియయ్యే మధ్య తరగతి కుటుంబాలను గురించే మనం ఎక్కువగా ఆలోచించవలసినది. ఈ తెగకు చెందిన పెద్దలు తమ కూతుళ్లను కాంక్షాన్నను సరించైతేనేమి, లేక ఒక్కసారే కట్నమిచ్చి పెళ్ళిచేసే స్తోమతులేకనైతే నేమి ఉన్నత విద్య చెప్పిస్తున్నారు. అంత చదువుకున్న తరువాత ఏ అమ్మాయీ ఊరికే యింట్లో కూర్చుంటానికి కిష్టపడదు. పైగా యింట్లోని ఆర్థిక పరిస్థితులను అర్థం చేసికొంటుందేమో, వెంటనే ఏదో ఒక ఉద్యోగంలో ప్రవేశిస్తుంది. ఇక అసలు సమస్య ప్రారంభమయేది యిక్కడే.

యుక్తవయస్సు వచ్చి ఉద్యోగంచేస్తున్న ఆడపిల్ల కల మధ్యతరగతి కుటుంబీకుడి అవస్థ వర్ణనాతీతం! అటు కట్నమిచ్చి ఆమె చదువుకు సరిపడ వరుణ్నీ తేలేడు, ఇటు ఒకవేళ అమ్మాయి ధైర్యంచేసి ఎవరినైనా పెళ్లిచేసికొంటే మనస్ఫూర్తిగా అంగీకరించనూలేడు. ఇలాటి పరిస్థితుల్లో ఆ తండ్రి కర్తవ్యమేమిటి? అతనికున్నవి రెండే మార్గాలు.

కట్నం తీసుకోకుండా చేసికొనేవాడికే అమ్మాయి నిస్తానని భీష్మించుకోవాలి, లేదా, అమ్మాయి స్వతంత్రించి చేసికొన్న వివాహాన్ని ఆమోదించగలగాలి.

అలాగే తమ కూతుళ్లు స్వయంగా వరించి చేసికొన్న వివాహాలను ఆమోదించగల ధైర్యం పెద్దల్లో రావాలి. సాధారణంగా ఇలాటి ప్రేమ వివాహాలకు పెద్దలంగీకరించ లేకపోవటానికి కారణం అవి కులాంతర, వర్ణాంతర వివాహాలవటమే!

కులాంతరవివాహాలకు తామే కట్నమిచ్చి పెళ్లిచేసే పెద్దలున్నారేమో కాని తమ పిల్లలకు స్వయంగా తమచేతుల్తో వర్ణాంతర వివాహాలు జరిపించే పెద్దలు లక్షమందిలో ఒక్కరుకూడా లేరు యీనాటికీ మన దేశంలో. తమ పిల్లలీ మార్గంలోకి వస్తున్నారని ముందుగానే పసిగట్టినట్లయితే వారిని చతుర్విధోపాయాలు ప్రయోగించి ఆపాలని చూస్తారు. దీనికి వారి అజ్ఞానం, అహంభావం తప్ప మరో కారణం కనపడదు. అలా యుక్తవయస్సు వచ్చిన పిల్లలపై అధికారం చెలాయిస్తూ జీవిత నాటక రంగంలో ముఖ్యాంశమైన వారి వివాహ విషయంలో తాము 'విలన్ల'గా ప్రవర్తించటంవలన అది వారి మానసిక స్థితిపై ఎలాటి ప్రభావాన్ని చూపుతుందో ఆఖరికి విద్యాధికులయిన తల్లిదండ్రులు కూడా ఆలోచించరు.

'ప్రేమ వివాహా'లని పిలువబడే యీ వర్ణాంతర వివాహాలను మనస్ఫూర్తిగా ఆమోదించగల నిజాయితీ, ధైర్యం పెద్దలలో ప్రబలంగా ఉన్నప్పుడు కట్నాల సమస్యలిలా తీవ్రరూపం దాల్చవు. ఈ విషయంలో యువతరంతోపాటు పెద్దలు కూడా పురోగమించినపుడే సంఘ శ్రేయస్సుకు దోహదమిచ్చిన వారవుతారు.

ఇలాటి అభ్యుదయ భావాలను కలిగి యుండటం గృహశాంతికి, కుటుంబశ్రేయస్సుకు అవసరమేకాకుండా అది ఒక సాంఘిక బాధ్యత అని కూడా పెద్దలుగుర్తించాలి. ●

వంటలు :

## అప్పం

అప్పం మదరాసులో చాలామంది ఉదయం తినే ఫలహారం. వీటిని సాధారణంగా ప్రత్యేకమయిన 'అప్పం చట్టి'లలోచేస్తారు. ఇవి ఒకదానిమీద ఒకటి పట్టే రెండు మట్టిగిన్నెలు. కిందిదానిలో పిండి పయిదానిలో నిప్పు ఉండాలి. ఇవి ఎక్కడపడితే అక్కడ అమ్ముతారు, మదరాసు ప్రాంతాలలో!

ఇవి దొరకనప్పుడు వీటిని మామూలు ఇనప బూరెల మూకుడులో చెయ్యవచ్చు. దానికి సరిగ్గా పట్టే మూత ఉండాలి. లోపలి ఆవిరి తేలికగా బయటికి పోరాదు.

500 గ్రాముల బియ్యం పొద్దునే నాన పెట్టి మధ్యాహ్నంగాని, సాయంకాలంగాని వాటిని మళ్లీ కడికి, రాళ్లుతీసి జల్లెడలో నీరంతాపోయేదాకా ఎండపెట్టాలి.

ఆ తర్వాత బియ్యాన్ని పిండిగాదంచి, సన్నని జల్లెడద్వారా పట్టాలి. పయిన మిగిలినసండిని 'కంజి' చెయ్యటానికి వాడాలి—సాధారణంగా ఇది ఒక కప్పులో పట్టేటంత మాత్రం మిగులుతుంది.

దీనికి చిక్కటిపిండి వచ్చేదాకా నీరు చేర్చి, సుమారు ఒకటి ముప్పావు కప్పుల మసలుతున్ననీటికి చురుకుగా కలుపుతూ చేర్చాలి. గట్టిపడగానే నిప్పుమీదనుంచి దించివెయ్యాలి. ఇది జాగ్రత్తగా చెయ్యాలి.

కంజి చల్లబడినతర్వాత మిగతా పిండితో కలపాలి. అవసరమయితే కొంచెం నీరు కలపవచ్చు.

ఒక కొబ్బరికాయ నీరు కలిపితే మంచిది. ఇప్పుడు పిండి గట్టిగా ఉండాలని మర్చిపోరాదు. దీనికి గట్టిగా మూతవేసి పొయ్యి దగ్గర, వెచ్చటిచోట, రాత్రి ఉంచివెయ్యాలి. (మూతపెట్టేముందు పిండి మీద సన్నటిగుడ్డ కప్పటం కద్దు.) కొందరు పిండి బాగా పులవటానికి పావుకప్పు పుల్లమజ్జిగ కలుపుతూ ఉంటారు.

ఉదయం 2 కప్పుల కొబ్బరిపాలు తయారుచేసి —ఒక పెద్దకాయ చాలు: వేడినీటితో పాలుతియ్యవచ్చు—బాగా చల్లార్చి పిండిని కలపాలి. ఇప్పుడు ఒక చంచా ఉప్పు(పొడి), 1 చంచా సోడా (పొడి) వెయ్యాలి. ఇప్పుడు పిండి బాగా మెత్తబడి ఉంటుంది.

బూరెల మూకుడుని కొద్దిగా వేడిచేసి, నూనెగుడ్డతో చమురు పన్నగాపట్టించి ఒక ముద్ద పిండి మధ్యలో వెయ్యాలి. ఇప్పుడు బూరెల మూకుడుని గిరగిరతిప్పి చక్రంలాగ వచ్చేట్లు చెయ్యవచ్చు. వేడిగిన్నెని గుడ్డతో పట్టుకోవాలి. ఇది కుదరకపోతే పిండిని చక్రంలాగ పోసి మధ్యభాగాలలో మరి కొంచెం పిండివేసి మూతపెట్టి నిప్పుమీద వేగనివ్వాలి. రెండు నిముషాలతర్వాత మూత తెరిచిచూస్తే 'అప్పం' వేగి ఉండాలి. అంచులు ఎర్రబడి ఉంటుంది. మధ్యభాగం దళసరిగా ఉంటుంది. కాని, తీసేముందు మధ్య పచ్చిపిండి ఉండకుండా చూడాలి.

మళ్లీ అప్పం వేసేముందు మూకుడు శుభ్రంచేసి, వేడిచేసి, చమురు పట్టించాలి.

అప్పం చట్టిలు ఉంటే పయిభాగంలో నిప్పు ఉంచి వండాలి. కిందా, పయినా నిప్పు ఉండటంచేత 'అప్పం' బాగా కుదురుతుంది. ఎప్పుడూ ఈ వంట పెద్ద మంటమీద చెయ్యరాదు. అప్పాలు మాడిపోతాయి.

—ఎ. బి. ●

# లావ్ ట్సె

క్రీస్తు జన్మించటానికింకా అయిదు శతాబ్దాలు ఉన్నాయి. ఎనభయ్యేళ్ల వృద్ధుడు ఒంటరిగా దున్నపోతు ఎక్కి వెడుతున్నాడు. అది చైనాలోని 'హొనాన్' రాష్ట్రంలోని 'షావ్' జిల్లాలోని 'సన్-చె.' అతను చైనా మహా కుడ్యం వయిపు వెడుతున్నాడు. గోడని చేరగానే ఒక ద్వారంవద్ద 'ఇన్‌షీ' అనే రక్షకుడు వచ్చి అతనికి స్వాగతం చెప్పాడు. అంతకిముందు ఇన్‌షీకి ఒక కల వచ్చింది. అందులో ఒక గొప్ప జ్ఞాని ఆరోజు అక్కడికి వస్తాడు, వచ్చి తన సిద్ధాంతాల సూత్రాలని ఇన్‌షికి చెప్తాడు. ఇన్‌షీ ఈ వృద్ధుడిని చూడగానే స్వప్నంలోని వృద్ధుడు అతనేనని గుర్తుపట్టాడుట. వచ్చిన వృద్ధుడు కూడా అతనికి తన సిద్ధాంతాలని చెప్పాడుట.

ఈ సిద్ధాంతాల నిడివి కేవలం 5000 మాటలు మాత్రమే, 81 సూత్రాలు మాత్రమే. ఇందులో కొన్ని పద్యరూపంలో ఉన్నాయి. మొత్తం సేకరణ పేరు 'టావ్ టె చింగ్.' (అంటే జీవన్మార్గం.)

టావ్ టె చింగ్ చెప్పి ఇప్పటికి 24 శతాబ్దాలయినా అవి మనకింకా లభిస్తున్నాయి. కాని, వాటిని వర్ణించిన జ్ఞాని చరిత్రమట్టుకు సరిగ్గా తెలియదు. ద్వార రక్షకుడికి చెప్పి, వెంటనే తన దారిన తను వెళ్లిపోయాడు. ఎక్కడికో ఎవరికీ తెలియదు...

టావ్ టె చింగ్‌ని ఎందరో ఎన్నో విధాల అర్థం చేసుకున్నారు, తక్కిన మహా మత గ్రంథాలవలెనే. కాని, ఆధునిక తత్వవేత్తలు దీని సిద్ధాంతాన్ని చేతనమైనదానిగా వర్ణిస్తారు.

వృద్ధ జ్ఞాని పేరు లావ్ ట్సె. అతను తన జ్ఞానోదయ ఫలితాన్ని ఇతరులకి చెప్పాలనుకున్నాడు. అతని ఆశయం నెరవేరే ముందు ఎన్నో కష్టాలకి లోనయ్యాడు. మిత్రులు, బంధువులు అందరూ విముఖులయ్యారు. లావ్ ట్సె కూడా వారినుండి దూరంగా వెళ్లిపోవటానికి నిశ్చయించుకున్నాడు.

అసలు లావ్ ట్సె జీవిత వివరాలేవయినా మనకి మిగిలాయా? సంప్రదాయం ప్రకారం అతను క్రీ. పూ. 604 లో 'హెనాన్'లో జన్మించాడు. బుద్ధుడి సమకాలీనుడు. కావ్‌లోని రాజ గ్రంథాలయం అధికారిగా పనిచేశాడు. తర్వాత ఉద్యోగం విరమించుకుని లింగ్‌పో కొండలలోకి వెళ్లి జ్ఞాన చింతలో మునిగిపోయాడు. అక్కడ అజ్ఞాతంగా ఉండిపోదామనుకున్నాడు. కాని, అతని కీర్తి దేశమంతటా పాకిపోయింది. ఎందరో వచ్చి అతని శిష్యులు అవుతామన్నారు. వీరి ఆసక్తి అతనికి ఆనందం కలిగించలేదు. వారికి 'జీవన్మార్గం' సిద్ధాంతాలని అర్థం చేసుకునే పరిపక్వత లేదు. అందుచేత, అందరినీ వదిలి వెళ్లిపోయాడు ఒకరోజున. దేశ సరిహద్దులని దాటి అదృశ్యుడయిపోయాడు. అదృశ్యం అయ్యేముందు తన సిద్ధాంతాలని సూత్రీకరించి మరీ అదృశ్యుడయ్యాడు.

వాటి సారాంశం ఏమిటి? ఈ ప్రశ్నకి క్లుప్తంగా ఈ విధంగా సమాధానం ఇవ్వవచ్చు: మానవుడిమీద ఏరకమయిన నిర్బంధమూ ఉండరాదు. సంస్కృతి అనవసరం. నీతి నియమాలు సహజంగా ఉండాలి. ప్రభుత్వంకూడా అంతే. మానవుడి ముఖ్యావసరం అతని పురాణ స్వాతంత్ర్యమే. జీవన్మార్గంలో ప్రశాంతత, ఆత్మవిశ్వాసం, లేక స్థైర్యం అవసరం. 'సృజనాత్మక నిస్తబ్దత' అనేపేరు అతని సిద్ధాంతాలకి సరిపోతుందేమో, యుగయుగాలుగా చైనా అనుసరిస్తున్న సిద్ధాంతాలకీ వర్తిస్తుందేమో...

—ఎస్.





# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

# 16 పల్లెటూళ్ళు



## తూనిక

(క) తూనిక:

సీసాలు, గ్లాసులు, సాసర్లు, నీళ్ళ పాత్రలు ఉపయోగించి, తూకంవెయ్యడం ఇక్కడి బొమ్మలో కనబడుతుంది.











1 సీసా + 1 గ్లాసు = 1 నీటి పాత్ర

1 సీసా = 1 గ్లాసు + 1 సాసరు

2 నీటి పాత్రలు = 3 సాసర్లు

1 సీసా = ఎన్ని గ్లాసులు ?

గ్లాసు బరువు 100 గ్రాములు అయితే, మిగిలిన వాటి బరువులు ఎంతెంత ?

## ఆరు పీపాలు



(చ) ఆరు పీపాలు:

బొమ్మలో ఆరుపీపాలు చూశారు కదూ! వాటిలో కొన్నిటిలో నూనె, కొన్నిటిలో నెయ్యి ఉంది. లోపల ఎంత సరుకుందో పీపాపైన వ్రాసిఉంది. నెయ్యి ఖరీదు నూనె ఖరీదుకి రెట్టింపు.

ఒక ఆసామీ ఈ దుకాణానికి వచ్చి 5 పీపాలలో ఉన్న సరుకు అంతాకొని, నూనెకి 140 రూ, నేతికి 140 రూ.లు చెల్లించాడు. మిగిలిపోయిన ఆరో పీపా ఏదో తెలుసుకోగలరా?





(ట) 16 పల్లెటూళ్ళు:

ఒక తాలూకాలో ఉన్న 16 పల్లెటూళ్ళను ఇక్కడి బొమ్మలో సున్నలతోనూ, ఆ ఊళ్ళమీదుగా వెళ్ళే రోడ్లను తిన్నని గీతలతోనూ సూచించాను.

ఒకడు 1వ ఊళ్ళో మోటారు సైకిలు మీద బయలుదేరేడు. ఈ ఊళ్లనన్నింటినీ ఒక్కొక్కసారి మాత్రమే చూచి, తిరిగి 1వ ఊరు చేరుకోవాలని అతని ఉద్దేశం. తిన్నని రోడ్లవెంట మరో ఊరు వచ్చే వరకూ వెళ్లాలేకాని, రోడ్లు కలిసినచోట మరోదారిపట్టి వెళ్ళకూడదు. ఏ వరుసలో ఊళ్లను చూచుకుంటూ వెడితే ఈ పని సాధ్యం అవుతుందో చెప్పగలరా ?





## జ వా బు లు

(క) 2 నీటిపాత్రలు, 3 సాసర్లు బరువుకి సమానం. కనుక 1 సాసరు = 2/3 నీటిపాత్ర.

రెండవ బొమ్మలో రెండు సిబ్బెలలోనూ చెరొక గ్లాసూ అదనంగా పెడదాం. దీనితో (1), (2) బొమ్మలలో ఎడమవైపు సిబ్బెలలోఉన్న వస్తువులు సమానం. 'కనుక, కుడివైపువికూడా సమానం అవాలి కదా. అంటే.

1 నీటిపాత్ర=2 గ్లాసులు+1 సొసరు కాని 1 సొసరు=2/3 నీటిపాత్ర అని తెలిసింది. కనుక, 1 నీటి పాత్ర = 2 గ్లాసులు+2/3 నీటిపాత్ర. కనుక, 1 నీటిపాత్ర= 6 గ్లాసులు.

ఇప్పుడు మొదటి బొమ్మలో కుడివైపు సిబ్బెలో నీటిపాత్రకు బదులు 6 గ్లాసులు ఉంచితే,

1 సీసా+1 గ్లాసు = 6 గ్లాసులు.

కనుక, 1 సీసా = 5 గ్లాసులు.

1 గ్లాసు బరువు =100 గ్రాములు.

కనుక 1 సీసా బరువు=500 గ్రాములు.

1 నీటి పాత్రబరువు= 600 గ్రాములు.

(2) వ బొమ్మనుబట్టి

500 గ్రా=100 గ్రా+ 1 సొసరు లేక 1 సొసరు బరువు+ 400 గ్రాములు.

*　　*　　*

(చ) 13 కిలోలు, 15 కిలోలు ఉన్న పీపాలు నేతివి. నెయ్యి ఖరీదు కిలో 5 రూపాయలు అయితే వీటి మొత్తం 140 రూ.లు అవుతుంది. 8, 17, 31 కిలోల పీపాలు నూనెవి. నూనె ఖరీదు కిలో రూ. 2 50 పై. అయితే వీటి మొత్తం. 140 రూ.లు అవుతుంది మిగిలిపోయినది 19 కిలోల పీపా అందులో నూనె ఉందో, నెయ్యి ఉందో మనకు తెలియదు.

(ట) బయలుదేరేముందు కొంచెం ఆలోచిస్తే ఈపని సులభంగా చేయవచ్చు. 1వ ఊరిని కలుపుతూ రెండుదారులు మాత్రమే ఉన్నాయి. 1—9, 1—12 అనేదారులు ఇవి. ఈ రెంటిలోనూ ఒకదారి వెంట బయటికివెళ్లి రెండవదారి వెంట ప్రయాణం అంతా పూర్తిఅయాక తిరిగిరావాలి. తప్పదు. అంటే 9వ ఊరికి ముందరవెడితే 12వ ఊరు ఆఖరిదికావాలి, లేదా 12వ ఊరుకి ముందువెడితే 9వ ఊరు ఆఖరిదికావాలి.

1, 2, 5, 6, 7, 8 అనే ఆరు ఊళ్లనుంచి రెండు రెండు రోడ్లుమాత్రమే ఉన్నాయి. ఈ ఊళ్లను చూచి రావాలంటే ఈ రెండుదారులనూ ఉపయోగించి తీరాలి. కనుక (13 - 2 —10;(9—5—14); (10—6—15); (3—7—13); (4—8—14) అనే దారులను తప్పకుండా ఉపయోగించాలి.

(64వ పేజీ చూడండి)

# అల్లరి పిల్లల బియ్యేక్లాస్

వన్నెచిన్నెల చిలిపి పిల్లలు
　　అల్లరులకే పుట్టినారు.
ఎవరు చెప్పిన గాని వినరు
　　విసిగి పోవును మీదు ప్రాణము.

పాఠాలనలే గిట్టవు వారికి
　　కాలేజీలే అల్లరి ప్లేసెస్.
(అల్లరిలో) అండర్‌స్టాండింగ్ ఫర్ యీచ్ అదర్
　　ఇంటెగ్రేషన్‌కి వీరు ఎగ్జాంపుల్.

బియ్యే క్లాసంటే బాబోయ్!
　　దుయ్య బట్టుతా రా పిల్లలు.
పెళ్లాలంటే ప్రాణం పీచు పీచు
　　వెళ్లినా తప్పవు కిచకిచలు.

ఏం చెయ్యాలో తెలియని వారు
　　అన్ని సబ్జక్టుల మాష్టర్లు
ఫీమేల్ ఎలిమెంట్ ఎక్కువ యిక్కడ
　　'హౌటు మానేజ్' అంటారు.

(సూ: ఆడపిల్లలు ఎక్కువవున్న క్లాసులో మాష్టర్ల అవస్థ చూచాక వ్రాసినది. ఇది వారికే అంకితం.)

—వి. రాజేశ్వరి.

# మట్టిబొమ్మలు



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాస్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. వెంకట్రామయ్యగారికి జబ్బుచేసి మరణిస్తారు. మద్రాసులో చదువుకుంటున్న మధు సెలవులకని యింటివచ్చి ఉత్సవాల్లో కామయ్య మాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. అప్పమ్మగారు వెంటనే మధుచేత మద్రాసు ప్రయాణం కట్టిస్తుంది. కొత్తగా తయారయిన స్కూలు భవనం ప్రారంభోత్సవాల్లో చాలా శ్రద్ధాసక్తులు చూపించారు శారద, ప్రసాద్‌లు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. తప్పించుకు తిరుగుతుంటాడు ప్రసాద్.

## 12

అతను వెళ్ళిన మరు నిమిషంలో ఊర్మిళ వచ్చింది. ఆకు పచ్చరంగు శాలువా భుజానవేసికొని అతను వెళ్ళిపోవటం గమనించి ఎంతగా నిస్పృహ చెందుతుందో, ఎంతగా అతని దైన్యపరిస్థితిని గూర్చి ఆరాటపడుతుందోనని శారద ఆమె ముఖాన్ని జాగ్రత్తగా పరిశీలించింది. అతని నిష్క్రమణ వలన తన ముఖంలో ఏలాటి భావమూ ఉత్పన్నం కాలేదు. 'వెళ్ళిపొయ్యాడా?' అని సహజకంఠంతో పలికి ఆ శాలువను మంచంపై జారవిడిచింది. శారదకేసి ముఖం తిప్పుకొని 'పాపం...బావ మనస్సు—బాగులేనట్టుంది శారదా! రోజులా హుషారుగా లేదు—ముఖమంతా ఎలా వాడిపోయిందో గమనించావా?...జ్వరమొచ్చిందే అనుకో—కాని ఎంత జ్వరమయినా లెక్కజేసే రకంకాదు తను...జ్వరంలోకూడ ఏదో ఒకటి వాగుతూండటమే అలవాటు—ఎలా వచ్చిందో అలానే పోతుందీ జ్వరమని నిర్లక్ష్యంచేసేవాడు...పైగా పడుకోమని చెబితే ఎందుకలా నిర్లక్ష్యంగా వెళ్ళాడిప్పుడు...' అని కొన్ని క్షణాలు శూన్యంలోకి చూసి... 'నీ కేమనిపిస్తోంది' అంది కుతూహలంగా శారదకేసి సూటిగా చూస్తూ.

ఆమె మనస్సులో ఎన్నో ఆలోచనలు క్రిక్కిరిసి పోయినట్లు, రెప్పలు వాల్చుకొని నేలచూపులు చూడసాగింది అచేతనంగా నిలబడి. కనుకొలకుల్లో రెండు కన్నీటిబొట్లు నిలిచాయి.

'శారదా!...ఏమిటి— ఉన్నావ్'...చెక్కిన పాలరాతి శిల్పంలా ఒకే భంగిమలో నిలబడిన శారదను భుజాలుపట్టుకొని ఊగించింది. అప్పటివరకూ ఏదో ఆలోచనలో కొట్టుకుపోయిన శారద మళ్ళీ ఈ లోకంలో కొచ్చింది. కనురెప్పలు పైకెత్తుకొని ఊర్మిళకేసి చూసింది— సిగ్గుతో కూడిన అర్థంలేని చిరునవ్వు తన పెదవులపై మెరసింది. వెంటనే రెండు చేతులతోనూ ముఖం కప్పుకొని మంచంపై బోరగిలా పడిపోయింది. ఏమిలేదు...ఏమిలేదంటూ.

ఊర్మిళ ఆమె తలదగ్గరగా కూర్చుని జడను ప్రేమగా నిమురుతూ, తనపై వాలి'...పాడుబొమ్మ...పగిలితే పగిలిందిలే... దాన్ని గూర్చి 'ఇద'వకుమని ఎన్నిసార్లు చెప్పాలి...లే'...అంటూ అనునయంగా పలికింది.

'అది కాదు...ఊర్మిళా'...దిండులో ముఖం దాచుకొని మెల్లగా పలికింది.

'ఏదికాదు...లే...నాకన్నీ తెలుసు ... ఆ బొమ్మకోసం నేను బాధపడుతున్నానని కాదూ నీ విలా ఆలోచించటం...లే...లేవమ్మా... మా బంగారుతల్లిగా—'అంటూ గిలిగింతలు పెట్టి పెద్ద పెద్ద నవ్వుల పువ్వులు వెదజల్లింది...నేనేమి బాధపడటంలేదని శారదకు స్ఫురించేలా...

గిలిగింతలతో శారద ఉక్కిరి బిక్కిరయిపోయి తను కూడ నవ్వింది. వెళ్ళకిలా తిరిగి ఊర్మిళ చేతులు తన చేతుల్లోకి తీసికొని గట్టిగా నొక్కింది. ఆనంద పారవశ్యంలో ఆమె రక్తం నరనళ్ళు తొక్కినట్లు మరింతబలంతో ఆమె వేలివేళ్లను తనవేళ్ళమధ్య ఇరికించుకొని,...'ఆ బొమ్మను గూర్చి నేనసలు ఆలోచించటంలేదు... తెలుసా' అంటూ ఆమెను తన వక్షస్థలం పైకి లాక్కొంది.

'అబ్బబ్బ...నాచేతులొదిలిపెట్టు శారదా.. నీ కిదేం పిచ్చి...ఈవేళ' అంటూ పడక నుండి క్రిందకు దూకింది.

చెరిగిన ముంగురులను పైకి తోసుకొని, చీరె సరిజేసుకొని తలప్రక్కకు తిప్పుకొన్న శారదముఖంపై సూర్యరశ్మి పడి కళ్ళు రెపరెప లాడాయి.

'మీ ఇల్లు చాలాబాగుంది ఊర్మిళా!... ఏకాంతంగా నీ ఒక్కర్తెవే కలలు కంటూ పడుకోవచ్చు...ఈ కిటికీనుండి నీ పడకపై సూర్యకిరణాలు ఎంత చక్కగా ప్రసరిస్తున్నాయి' అంటూ లేచింది.

కళ్ళు ఇంతింతలుచేసికొని అద్దంలోకిచూసికొంది. జడముందుకేసికొని వదులైపోయిన దానిని విప్పి అల్లుకోసాగింది.

'నీకు కవిత్వంకూడా వస్తోందే ఈ మధ్యన...కానివ్వు—కానివ్వు...మా నాన్నగారు వచ్చేఉంటారు ... వెళ్దువుగాని' ... ఊర్మిళ హెచ్చరించింది.

'అమ్మ బాబోయ్. నేనా విషయమే మరచిపొయ్యా' అంటూ అద్దం కిటికీలో పెట్టేసి...'పాడుపిల్లవు—నీవేగా బలవంతాన తీసికొచ్చింది' అని త్వరత్వరగా ముస్తాబు ముగించుకొని 'పద...అలా కూర్చున్నావేం ఇంకా' అంది ఊర్మిళకేసి తిరిగి.

'నేనెందుకు...నేనురాను— నిశెళ్ళటా'...జాలిగా కళ్ళుతిప్పుకొంది ఊర్మిళ బుంగ మూతిపెట్టుకొని.

'అలాకాదు ... నన్ను ఇంటివరకూ గదిబెట్టేరా?...నేను బయల్దేరేప్పుడే చెప్పానా లేదా?'

'చెప్పావనుకో...ఈవేళకు క్షమించు' ఉదాసీనంగా ముఖం పెట్టుకొంది నిస్సహాయతను చూపిస్తూ.

'ఎందుకు...ఏదైనా పనుందా?'

'పనీలేదూ పాటాలేదు... మా అత్తయ్యగారింటికి వెళ్దామని'...వెలుగుతూన్న విద్యుద్దీపం ఒక్కసారే ఆరిపోయినట్లు శారద ముఖంపై సిరినీడలు కమ్ముకున్నాయి. కనుబొమలు దగ్గరగా తీసికొని—'ఎందుకు... అంతత్వరగా వెళ్ళాల్సినపనుందా?' అంది.

'పనేమీలేదనుకో'... అంటూ దీర్ఘంతీసి ఆలోచిస్తూన్నట్లు చూపుడువేలితో బుగ్గ నొక్కుకొని క్షణం గడిచాక ఒక నిర్ణయానికొచ్చినట్లు ముఖం మార్చుకొని...సరే...నీ ఇంటికే పోదాంపద ... నేను ఆగమంటే మాత్రం ఆగుతాడా?' అంది.

'ఆగేదెవరు' ... విస్మయంతో అడిగింది శారద నడుస్తూ.

'ఇంకెవరూ?...తెలియనట్లడుగుతావ్... ఆ బస్తీబాబు ... నీతో చెప్పలా · మద్రాసు పోతున్నా నీవేళని...'

'నాతో ఆ విషయమే ప్రస్తావించలేదు.'

'మరి ఇప్పటివరకూ నీతో ఏం మాట్లాడాడు ... అసలు సంగతిచెప్పకుండ—అయినా నీతో అనవసరంగా ఎందుకు చెప్పలమకొన్నాడేమో మరి ... మొదటరాగానే నన్ను ప్రక్కకు పిలిచి అదే చెప్పాడు... 'నేను మద్రాసుపోతున్నా నీవేళ...నీతో చెప్పి వెళ్దామని వచ్చాను...కొద్దిగా తలనొప్పిగా ఉంది కాఫీ చేస్తావా?...నీచేతి కాఫీత్రాగి మద్రాసు వెళ్ళిపోతానన్నాడు'... సరేలే...కాఫీ త్రాగించి మాటల్లోదింపి అసలు విషయమేమిటో, ఎందుకు వెళ్తున్నాడో తెలుసుకొందామనుకొంటే ... చెప్పకుండనే జారుకొన్నాడు మనిషి...చూడు' అంది.

నడుస్తూన్న శారద 'బ్రేక్' పడినట్లు ఆగిపోయింది. వీధివైపు చూస్తూన్నచూపు ఊర్మిళవైపు మళ్ళించింది...'ఈవేళే వెళ్ళిపోతున్నాడా ... అంత తొందరేమొచ్చింది'... ఆమె కన్నుల్లో వేదన స్పష్టంగా కనిపించింది.

'అదే నా కర్థం కావటంలేదు...చపలపు మనిషి...ఉన్నట్టుండి పొద్దున్నే 'అమ్మా నే నీవేళ మద్రాసు వెళ్తానని' మంకుపట్టు పట్టి కూర్చున్నాట్ట. దానితో మా అత్త నా దగ్గరకు జీతగాణ్ణి పంపించింది... కందిపొడుం — గోంగూర ఊరకాయ కట్టి పంపాలి త్వరగా రమ్మనమని... నేను నమ్మాలా?... ఎందుకంటే ... పోతాను... పోతానంటూనే ఈ మహాను భావుడు పదిరోజులు గడపటం నాకు



తెలుసు...కాని ఇప్పుడు మాత్రం నిజమే ననిపిస్తోంది... ఏదో దిగులు పట్టుకొన్నట్టుంది' అంటూ ముందుకు కదిలింది.

శారద ముఖంలో రంగులు మారాయి. ఏమీ మాట్లాడలేక కొద్దిసేపు మౌనం వహించింది.

'పాపం...అంత జ్వరంలోనూ ఎలా వెళ్ళిపోతాడూ?... కనీసం జ్వరం తగ్గే వరకైనా ఉండి పొమ్మని చెప్పు'... మెల్లగా అంది ఎటో చూస్తూ.

'మా బావ సంగతి నీకు పూర్తిగా తెలియదు...పసిపిల్లవాడికన్నా అధ్వాన్నం... ఎప్పుడేది కోరుకుంటే అప్పుడది జరిగి తీరాల్సిందే...కావాలంటే కొండ మీద కోతినైనా తెచ్చి కాళ్ళముందు పడెయ్యాల్సిందే...ఆ కొండంటే జ్ఞాపకమొచ్చింది... కొండపైన 'పార్టీ'ని గూర్చి ఏమాలోచించావ్...ఆ లాంటి పార్టీలు మా బావకు చాలా ఇష్టం...'పార్టీ' చేసుకొందామంటే చాలు... వెంటనే హోల్డాలు విప్పి పారేస్తాడు...కానీ'...అంటూ కొద్దిసేపు తటపటాయించింది.

'నీకిష్టం లేదుకదూ?'...ప్రశ్నించింది...

మాట్లాడుతూ మాట్లాడుతూ వీధి గుమ్మం చేరారు.

శారద 'పార్టీ' చేసికోవటం పట్ల సుముఖతగానీ విముఖతగానీ చూపకుండ... 'అంత

# మట్టిబొమ్మలు

జ్వరంలోనూ కొండపైకి ఎలా రాగలడీవేళ' అంది సంశయాత్మకంగా.

'ఈ వేళ కాకపోతే రేపు... పార్టీ చేసికొందామని నిశ్చయించుకొంటే ఎలాగో మద్రాసు పోకుండ ఆపెయ్యవచ్చు. అదీ నేను చెప్పేది'...

'అయితే... ఇంకేం...అలానే చెప్పు ... ఎలాగో ఈవేళ మద్రాసు ప్రయాణం విరమించుకోనేలా చెయ్యి...పాపం అంత జ్వరంలోనూ ఎలా వెళతాడు...పిచ్చి చేష్టలు కాకపోతే'... వాత్సల్యపూరితమైన చిరుకోపం ధ్వనించింది ఆమె కంఠంలో...

వీధి మలుపు తిరిగారు. ఆ మలుపులో మరో రెండు వీధులొచ్చి కలిశాయి. అక్కడ వాళ్ళు చీలి చెరో మార్గాన వెళ్ళవలసిన సంధి స్థలం. ఊర్మిళ తను వెళ్ళవలసిన వీధిలో మొత్త ప్రక్కనే పెంకుటింటి నీడలో నిలబడి...'నే చెబితే నమ్ముతాడో... నమ్మడో...నీవు కూడ రారాదూ?... మనిద్దరమూ కలిసి మా అత్తయ్యగారింటికెళ్ళి మళ్ళీ మీ ఇంటికి పోదాం...సరేనా?'... అంది.

అప్పటివరకూ ఆమెకు ఎదురుగా ఎదురుగా ఉన్న వీధి మొదట్లో ఎండలో నిలబడిన శారద ఆ మాట విని ఊర్మిళ వెంట




కొచ్చి నిలబడింది.

'అయితే మనిద్దరమూ వెళ్దామంటావా?... తన దగ్గరకు ... నేనొస్తే మద్రాసు ప్రయాణం విరమించుకొంటాడా?' అంటూ ముందుకు కదలక వెనకా ముందు చేయసాగింది. ఇంటికి వెళ్ళాలన్న ధ్యాసే మరచి పోయింది. తను వెళ్ళవలసిన మార్గం వదిలి మరో రాస్తాపై అడుగుపెట్టి తన సంకల్పం ఎలాటి పరిణామాలకు దారి తీస్తుందోనన్నట్టు సందేహిస్తూ ఆగి పోయింది.

'నేను రామలే'... అని తనలో తాను మాట్లాడుకొన్నట్టు గొణుక్కొంది. ఆ మాటలో స్థిరమైన నిశ్చయంలేదు. ఒక్క నిముషం వాళ్ళిద్దరూ ఏమీ మాట్లాడుకోకుండ పెంకిటింటి చూరు క్రింద నిలబడ్డారు. వీధంతా నిర్మానుష్యంగా ఉంది. సుడిగాలి రోడ్డు ఊడ్చుకొంటూ వచ్చింది. చెత్తా—చెదారం కాగితాలూ గుండ్రంగా సుళ్ళు తిరుగుతూ వాళ్ళను చుట్టుముట్టాయి. ఆ సుడిగాలికి భయపడి కళ్ళు మూసికొన్నారు. గాలి నిమ్మళించింది. కాగితాలు భూమిమీదకు దిగకుండ అస్పష్టమైన ఆలోచనల్లా తేలుతున్నాయి. చిటచిటలాడుతూ ఎండ మిడిసిపడుతోంది.

మెరుస్తూన్న ఎండలో పొడుగాటి వ్యక్తి వాళ్ళవైపుగా రావటం గమనించారు. తెల్లని పైజమా— లాల్చీ వేసికొని గాలిలో ఊగుతూ అటువైపు రాసాగాడు. వాళ్ళిద్దరికళ్ళూ కుంచించుకుపోయ్యాయి —గుచ్చి గుచ్చి గుచ్చి చూశారు. అతను వాళ్లను సమీపించాడు.

* * *

'అరే...ప్రసాద్—నీవా?...ఎక్కడికి ఇటు బయల్దేరావ్ ఎండలో...నీ కోసమేనే నేను'... అదరాభిమానాలతో చిరునవ్వుతో ఊర్మిళ పల్కరించింది.

సూర్యునిలా తీక్షణమైన అతని చూపు ఒక్కక్షణం వాళ్ళిద్దరినీ ఆపాదమస్తకం పరిశీలించింది.

ఎర్ర టోపీని చూసి నేరస్థుడు కంగారు పడి సూటిగా చూడలేక కళ్ళు అటూ ఇటూ తిప్పుకొన్నట్టు శారద అతని ముఖంలోకి చూడలేకపోయింది. ఆమె చూపులు అతని పాదాలపై వాలిపోయ్యాయి. అక్కడ నుంచి చూపును పెగల్చుకొనే శక్తిలేక

**అలానే క్రిందకు చూస్తూ ఉండి పోయింది... అతను పెదవులు విప్పుకొన్నాడు.**

'నేను మీ ఇంటికే వస్తున్నాను ఊర్మిళా!... మీ నాన్నగారున్నారా?...ఉదయంనుండి మాష్టారు చార్జి అప్పచెబుతున్నారు కొత్త హెడ్మాష్టరికీ...అయినా ఇంతవరకూ పనితెగలేదు...ప్రతి చిన్నవిషయానికీ మడతపేచీలు... చాలా వింత మనిషి...గుండు పిన్నులు కాడ్సించి ఒక్కొక్కటే లెక్కపెట్టి తీసుకొంటున్నాడు. బ్రతకనేర్చిన రకంలా కనిపిస్తున్నాడు... అదే 'మనసార'—చార్జి తీసికోవటమైతే 'ఫర్వాలేదండీ...ఇందులో మునిగి పొయ్యే దేముందని భరోసాగా తీసికొనేవాడు... ఇప్పుడు మనస్కూలు కట్టటానికి చందాలు—ఖర్చులదగ్గర ఆగిపోయింది. శివరామయ్య గారు లేనిదే డబ్బు లెక్కలు ఒక్కకాగితం ముట్టుకోను ? ... ఆయనుండాల్సిందేనని మొండికేస్తే...మీ నాన్నగారి కోసమని వచ్చా...ఇంట్లో ఉన్నారా!'

'ఊహూఁ' అని తల అడ్డంగా ఊపింది.

శారద ఏదో మాట్లాడాలని ప్రయత్నించి ఆగిపోయింది.

'అయితే అక్కడ లేడన్నమాట...మరింకెక్కడికి పోయినట్లు...ఉంటే చెరువుకట్టకాడ...లేకపోతే వరా అత్తగారింటి దగ్గర... ముందు చెరువు కట్టవద్ద...'

'సరే ... మీరేమిటి? ... ఇలా ఆగి పొయ్యారూ?...ఎటు వెళ్ళాలో ఇంకా నిశ్చయించుకోలేదా?... అటా?...ఇటా?...'

బలమైన దెబ్బ తగిలినట్లు చివ్వున ముఖాన్ని పైకెత్తుకొంది శారద. ఎదురుగా అతను—ప్రసాద్—ప్రశాంతంగా నిర్మలంగా ఉన్నాయి అతని కళ్లు. అతని పెదవులపై స్వచ్ఛమైన దరహాసం — ఆమె కళ్ళు చెమర్చాయి. కళ్ళు దించేసుకొంది.

'మా బావకు ఒంట్లో బాగులేదు ప్రసాద్...అయినా ఈవేళ మద్రాసు వెళ్లిపోతానంటున్నాడూ...అందుకని వద్దని వారించటానికి వెళ్ళపోతున్నాం ... అంతలో నీవొచ్చావ్...ఇప్పుడెటు వెళ్దాం—నీవుచెప్పు'...

'ఏటేమిటి? ... అందరమూ— 'మధు' దగ్గరికే వెళ్దాం ... అంతజ్వరంలో ఉండి ఎలా వెళ్తాడు ... భలేవాడేనే ... అయినా ఈవేళ ప్రయాణమని రాత్రి నాతోకూడ చెప్పలేదే... ఊఁ నడువు—శారదా...బాగా మసిత్తచేసిందా?'

శారద అటు తిరిగి నిలబడింది, తన విముఖతను ప్రకటిస్తూ...రెండడుగులువేసి ప్రసాద్ ఆగిపొయ్యాడు.

'రా...శారదా ! వెళ్ళి పల్కరించి పది నిముషాల్లో ఇంటికి వెళ్ళిపోదాం ... నిన్నటు దిగవిడిచి నేను స్కూలుకెళ్ళిపోతా ... మళ్ళీ వాళ్ళు నాకోసం ఎదురుచూస్తుంటారు'... అతని నిష్కల్మష హృదయం కన్నుల్లో తొణికిసలాడుతోంది.

'నేను రాను ప్రసాద్...నన్ను ఇంటివద్ద దిగవిడిచి నీవెళ్ళివద్దువుగాని' అని ఓక్షణం ఆలస్యం చెయ్యకుండా నిర్మానుష్యమైన వీధి కేసి చూస్తూ చకచకా నడకసాగించింది. వ్యధితహృదయం ఆమె కన్నుల్లో సుస్పష్టంగా కనిపించింది. మనస్సుతో సంబంధం లేకుండ కాళ్ళు ఇంటివైపు నడుస్తున్నాయి.

'సరే...నీవు ముందుపద ఊర్మిళా... శారదను ఇంటికి పంపిస్తాను' అంటూ శారదను అనుసరించాడతను.

ఆకర్షణీయంగా నిగనిగమెరిసే శారద చెక్కిళ్ళు ఎండ తీక్షణతకు వాడిపొయ్యాయి. గంభీరానికి నిండు కుండలా తొణకని తను ఈమధ్యాహ్నం, అనూహ్యమైన బాధతో సతమతమౌతూన్నట్లు అతను గ్రహించటానికి అట్టే వ్యవధిపట్టలేదు.

చీరె కుచ్చిళ్ళు కాళ్ళల్లో పడి ముందుకు తూలిపడపోయింది.

'మెల్లగా నడువు...అంత తొందరేమొచ్చింది...ఎవరో తరుముతున్నట్లు' అతనన్నాడు. ఆ మాటలు ఆమె శ్రవణేంద్రియాలలో ప్రవేశించాయి. కానీ మనస్సుకెక్కలేదు. ముక్కుసూటిగా చూసికొంటూ మాటాపలుకూ లేకుండా, నడవసాగింది.

రోడ్డంతా వానా కసాటుగా ఉంది—పెద్ద పెద్ద కంకరరాళ్ళు—ఎదురు తిరిగినకాళ్ళను కాటేయ్యటానికి సిద్దంగా తలెత్తుకొని నిర్భయంగా నిలబడ్డాయి. ప్రసాద్‌కు ఎడంగా తత్తరపాటుతో అంగలువేస్తూన్న శారద 'అబ్బ' అంటూ ముందుకు వంగబడిపోయింది.

**కాలిబొటన వేలు రక్తంతో తడిసిపోయి మట్టిమేటకు పోయింది. కొద్దిసేపు గాయాన్ని ఒత్తుకొని పరీక్షగా చూసికొని** నడవసాగింది.

'అయ్యో...శారదా!...జాగ్రత్తగా చూసి నడువు మెల్లగా.. ఇటురా...నావెనక్కు... అటెందుకు నడుస్తున్నావ్...'

అతన్ని అనుసరించటానికి తను ఉత్సాహం ప్రకటించలేదు. మధ్యలో ఒకరినొకరు పల్కరించుకోలేదు. శ్మశానవాటికనుండి తిరిగి వెళుతున్న బంధువుల్లా బరువుగా భారంగా నడిచారు. ప్రసాద్‌కు అటు ఎడంగా తను.

తనకు ఇటువైపు ప్రసాద్....సమానాంతరంగా యథేచ్ఛగా నడుస్తూ ఇల్లు చేరారు.

ఎండలో నడిచి నడిచి పంచపాళిలో అడుగు పెట్టటంతో ప్రాణానికి 'హాయ'నిపించి ఉస్సురని నిట్టూర్పువిడిచారు. శారద లోని కెళ్ళి అద్దంలో ముఖంచూసికొంది. కళ్ళు... చుట్టూ నల్లని రేఖలతో కాంతి విహీనమైపొయ్యాయి. ఆకస్మికమైన మార్పుకు గల కారణం— హృదయంలో చెలరేగిన ఆలోచనల తుఫానో లేక ఎండ తీక్షణతో ఆమెకు అవగతంకాలేదు.

అద్దం అక్కడపెట్టి చల్లటి నీళ్ళతో మొహం కాళ్ళా చేతులు కడుక్కుంది. ఎదురుదెబ్బ తగిలిన వేలుమాత్రం ముట్టుకోనివ్వలేదు. రక్తమయమయి ధూళీ ధూసరితమైన ఆ వేలును అలానే ఒదిలిపెట్టింది. టవలుతో ముఖం తుడుచుకొంటూ కుంటుకుంటూవచ్చి ప్రసాద్‌కు ఎదురుగా ఉన్న కుర్చీలో నడుం వాల్చింది.

'శారదా!...టించర్ అయిడిన్ వెయ్యనా',

అతని మాటలు వినిపించనట్లు పరాగ్గా చూడసాగింది. అతను మళ్లీ హెచ్చరించాడు.

'వద్దు — మంటబుడుతుంది'...ముందుకు చాచినకాలు వెనక్కి తీసికొని బుంగమూతి పెట్టుకొని చిన్న అమ్మాయిలా పలికింది.

'వద్దంటే ఎలా?...దెబ్బ తగలకుండ చూసికోవాలి....తగిలాక గాయాన్ని మాన్చుకోవాలి.,.. మొండికేసి కూర్చుంటే 'సెప్టిక్' అయ్యే ప్రమాదంకూడ ఉంది తెలుసా?... అయిడిన్ వేయించుకో నామాటవిని'...అతను లేచి బీరువాతీసి మందుసీసా తెచ్చి ఆమె పాదాలచెంత వంగాడు.

'**ముట్టి—శుభ్రంగా కడుక్కోలేదే' అని**

ఆమె సమాధానంకోసం ఎదురు చూడక ఒక శుభ్రమైన గుడ్డతెచ్చి జాగ్రత్తగా తుడవ నారంభించాడు. ఆమె బాధకు ఓర్చుకోలేక కళ్ళు మూసికొని మెడవెనక్కి వాల్చుకొంది. కాలు వెనక్కి లాక్కోసాగింది. అతను ఒక చేతితో ఆమె పాదాన్ని గట్టిగా పట్టుకొని మరోచేతితో శుభ్రంగా తుడిచి రెండుబొట్లు 'అయొడిన్' వేశాడు.

జివ్వుమనే అమంటకు తాళలేక ఆమె కుర్చీలో కదిలిపోయింది. కళ్ళు మూసికొని ప్రక్కకువంగి అసంకల్పంగా అతని చేతిని తనచేతిలోకి లాక్కొని గట్టిగా నొక్కుతూ 'చంపావ్...చంపావ్ ప్రసాద్...అమ్మా' అంటూ మూలిగింది. ఓ నిముషం గడిచాక మెల్లగా కళ్ళువిప్పి అతనికేసి చూసింది. సున్నితమైన తన చేతివేళ్ళు బలిష్ఠమైన అతని వేళ్ళతో మెలివేసికొని ఉన్నాయి.

'మంట తగ్గిపోయిందా' .... కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

'అవు' నన్నట్లు తల ఊపింది...చేతిని విడిపించుకొంటూ.

అమందు సీసాను బీరువాలో పెట్టి శారదకు ఎదురుగాఉన్న కుర్చీలో కూర్చు న్నాడు. ఆమె ఆలోచనా ప్రవంతిని అరి కట్టి మామూలు విషయాలపై ఆమె దృష్టిని మళ్ళించటానికి ప్రయత్నిస్తూ 'కనీసం...థ్యాంక్స్' అని కూడ అనవేం శారదా!' అన్నాడు నవ్వుతూ.

ఆ నవ్వుకు ప్రతిగా దరహాసంకూడ చూప లేదు ఆమె. ఆమెలో ఏమార్పూ రాలేదు.

'అంత అగత్యం లేదనుకొంటాను ప్రసాద్. నీమూలానే నాకీ దెబ్బ తగిలింది...లేకపోతే నేను ఊర్మిళవెంట—'మధుని' చూడటానికి వెళ్ళేదాన్ని ...ఆ దారిలో నాకీదెబ్బ తగిలేది కాదేమో.'

గాలి స్తంభించిపోయింది.గదంతా స్తబ్ధంగా ఉంది. శారద నొసటిపై చిరుచెమట పోయ నారంభించింది. ఆమె మాటలు అతనికి అర్థంకానట్లు నిశ్చల నిర్నిమేష దృష్టితో ఆమెను చూశాడు.

ఆమె కళ్ళు అతని జవాబుకోసమని నిరీ క్షిస్తున్నాయి. అతని గంభీరత చలించింది. నొసటిపై ముడతలు పడ్డాయి.

'నేను కనిపించేవరకూ నీకు ఎటువెళ్ళాలో స్ఫురించలేదా...భలేభలే ఈలాటి అనుభవం ఎవరికైనా అనివార్యం'...అన్నాడు.

'అవును...ఈవేళ అలానే జరిగింది.' అని తలవంచుకొని—గుండెల్లోకి తొంగి చూసికొన్నట్లు ఉచ్ఛ్వాస నిశ్వాసలతో పైకి పొంగిపడుతూన్న వక్షఃస్థలంకేసి చూపికో సాగింది.

ఆమె మాట్లాడుతున్న విధానం—ఏదో అమూల్యసంపత్తిని తను కోల్పోయినట్లు అవ్యక్తమైన ఆవేదనతో ఆకాశప్పటంచు లను వెతకటం—వాలిపోయి కూర్చోవటం—అన్నీ విపరీతంగా కనిపించాయి.

ఎండలో తిరగటంవలన ఇద్దరి ముఖాలు అలసటగా ఉన్నాయి ... వాతావరణమంతా నిరుత్సాహకరంగా ఉంది. అతని కళ్ళు 'భాను' కోసం లోనికి చూశాయి. కాని 'భానూ 'లేదు. అతను ఆమె దగ్గరగా కుర్చీలాక్కొని ముందుకువంగి ప్రశ్నించాడు.

'శారదా, ఈవేళ నీ మనసు అదోలా ఉంది...ఏం జరిగిందో నాతో చెప్ప కూడదా?'

'ఏమి జరిగిందో ప్రత్యక్షంగాచూశావ్‌గా... అనవసరంగా గాయంచేసుకొన్నాను.' అంటూ నవ్వటానికి వ్యర్థప్రయత్నం చేసింది.

'ఏమిలేదు ప్రసాద్...తలనొప్పిగాఉంది... కొద్దిసేపు పడుకుంటా...నీ వెళ్ళిరా...నాన్న గారు నీ కోసం ఎదురుచూస్తుంటారు... నీ వొచ్చి ఇక్కడేఉండి పొయ్యావ్...అయితే ఆ కొత్త హెడ్మాష్టరు కాలాంతకుడా?'... మాటలు మార్చటం కోసమై ఆమె అడి గింది.

## అల్లాటప్పయ్య



# మట్టి బొమ్మలు

ఆతను వెళ్ళటాని కుద్యుక్తుడై 'ఆహా... అలానే కనబడుతున్నాడు నాకు' అంటూ గడప దాటబోయ్యాడు.

'ముందు మధు దగ్గరికెళ్ళి...స్కూలు కెళ్తావా?'

'ఇప్పుడిక ఎండలో ఆ వీధి కెళ్ళలేను... స్కూలుకే వెళ్తాను...మాష్టారు నాకోసం ఎదురు చూస్తూండవచ్చు' ... అన్నాడు—ఆగి...

'అదికాదు ప్రసాద్...నీ వెలానైనా శివ రామయ్యగారిని వెతకాలిగదా...ఇటు 'మధు'ని పలకరించినట్లుగా కూడ ఉంటుంది... వాళ్ళింటికెళ్ళు...అతని చేష్టలుచూస్తే జాలివేస్తుంది చిన్నపిల్లవాడిలా...ఎలావోజ్వరం తగ్గేవరకూ ఆగి పొయ్యేలా ప్రయత్నించు'...

'సరే...'అంటూ అతనుముందుకు కదల బోయ్యాడు.

'తరువాత మరో విషయం ప్రసాద్... మన మనుకొన్నట్లు అతను అదోకరకమైన స్వభావం కలవాడు కూడా కాదు'...ఇంటి ముందున్న వేపచెట్టుకేసి చూడసాగింది. ఒక కొమ్మమీద వొళ్ళు కట్టేసుకొన్న కాకులు అతి వినయం ఒలక బోస్తున్నాయి.

'అతను అదోక రకమైన వాడని మన మెప్పుడనుకొన్నావ్...బహుశా అది నీ వ్యక్తి గతాభిప్రాయంకావచ్చు' అంటూ ఆమె ముఖ కవళికలను పరీక్షగా చూస్తూ అన్నాడు. ఆమె త్రుళ్ళిపడింది. చూపు వేపచెట్టుపై నుండి మరల్చుకొని తన్నుతాను సంభాళించు కొని 'అవును...నాదే పొరపాటు — మన మెప్పుడూ అతని స్వభావాన్ని గూర్చి ఆలో చించలేదు కదూ' అంది.

'ఈవేళ ఉదయం నీకు 'మధు' కలి శాడా? ...' సూటిగా ప్రశ్నించాడు. ఆమె కన్నుల్లో తొట్రుపాటు కనిపించింది. సమా ధానం చెప్పటానికి సందేహించింది. పెదవి విప్పకుండ లేదన్నట్లు తల అడ్డంగా ఆడిం చింది...

అతను అలానే వాకిలివద్ద నిలబడ్డాడు.

''సరే ప్రసాద్... మధు వద్దకు వెళ్ళితే వెళ్ళు...లేకపోతే లేదు...సాయంత్రం పెంద రాళే ఇంటికిరా...నీవూ నేనూ భానూ అలా మామిడితోపు వైపు షికారు పోదాం—నీకు 'బోర్' కొట్టటంలేదు—'' అంది మనసు కుదుటపరచుకొని—

'సాయంత్రమే... వెళ్దామంటావా ?... సరే...అలాగే' అని తలవంచుకొని ఒక నిము షం ఆలోచించుకొని తల పైకెత్తాడు 'ఊహూ' అనుకొంటూ. దేనిలోనో అతనికి విశ్వాసం సన్నగిల్లినట్లు ముఖం పెట్టు కొని 'నేను—రాలేను శారదా...మీరిద్దరూ వెళ్ళిరండి...' అన్నాడు.

'ఎందుకు?...నీవు తప్పకరావాలి ప్రసాద్, నన్ను అట్టే విసిగించకు... రానని ముందే ఎందుకు చెప్పలేదు...' బతిమాలుకున్నట్లు అడిగింది.

'రావటానికి నాకేమిలేదు...కానీ మాష్టారి ఛార్జి అప్పగించటం ఇంతటితో అయ్యేట్టు లేదు...అయినా ప్రయత్నించుతాలే...కానీ నాకోసం ఎదురుచూడకు' అంటూ చరచరా నడిచి వెళ్ళిపొయ్యాడు.

దిగాలుపడినట్లు అతను వెళ్తున్న వైపు ఓ క్షణం చూసిందో లేదో ఆమె కళ్ళలో భానూ కన్పించింది. పరికిణీ కుచ్చిళ్ళు ఎత్తిపట్టుకొని పరుగెత్తు కొంటూ వచ్చింది లోపలికి—'అక్కయ్యా అక్కయ్యా' అంటూ.

'అక్కయ్యా...సాయంత్రం పిన్నిగారి మిరపతోటకెళ్దాం...ఇన్ని బంతిపూలు తెచ్చు కోవచ్చు' కళ్ళు ఇంతింతలు చేసికొంటూ వగరుస్తూ చెప్పింది.

'ఓహో...అంతకన్నావా...అలానే వెళ్దాం. ...నిన్ను ఇంటివద్ద జాగ్రత్తగా ఉండ మంటే ఎక్కడికి పెత్తనాలకెళ్ళావ్...ఇల్లు వదిలిపెట్టి'...ప్రేమగా గద్దించింది.

'నేనెక్కడికెళ్ళాను...ఇక్కడే పిన్నిగా రింట్లో ఆడుకొంటున్నా... మధ్య మధ్య మన ఇంటికేసి చూస్తున్నా...మీరిద్దరూ రావటంకూడా నేచూస్తూనే ఉన్నా'...అంది భాను.

'చాలు—చాలు—వెళ్ళు—కబుర్లు— కొద్దిసేపు పడుకో' అని తనను లోనికి పంపింది కోపంగా.

(ఇంకా ఉంది)

# వారఫలం

## 30-6-1967 శుక్రవారం మొదలు 6-7-1967 గురువారం వరకు.

**మేషం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు వారాంతంలో బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలు విరాటంకంగా నెరవేరుతాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**వృషభం:** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారాంతంలో అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సజ్జన సాంగత్యం లభించగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. శుభకార్యాల విషయంలో కొత్త సమస్యలు తలయెత్తగలవు.

**మిథునం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారాంతంలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** కొన్ని వ్యవహారాల్లో మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా వుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభించ గలవు. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ముమ్ముందు ఉపయోగించగల వ్యక్తులను కలుసుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. అనుకూల వార్తలను వింటారు.

**కన్య:** ఇంతవరకు అనుకూలంగావున్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారాంతంలో మంచి పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:** ఫలితం మాట యెలాగవున్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారాంతంలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికం కాగలదు. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృశ్చికం:** వృత్తి వ్యాపారాల్లో శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించ గలదు. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. పోటీవారితో మాటపట్టింపులు తగవు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** ఇప్పుడు మీరు చేసే ప్రయత్నాలు కొన్ని వ్యర్థమై పోయినట్లు కన్పిస్తాయి, గాని వాటి ఫలితాన్ని మీరు ముమ్ముందు పొందగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**మకరం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణము ద్వారా కార్యసాధన చేయగలరు. సాంఘిక వ్యవహారాల్లో ప్రముఖపాత్రను నిర్వహించగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కుంభం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ప్రారంభంలో లాభించగలవు. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహించగలరు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడగలవు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**మీనం:** మీకు యిష్టం లేకపోయినా, యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. కోర్టు వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్



# జనాభా సమస్య

**సి. కనకాంబరరాజు**

మానవజాతి ఇప్పుడు అతి ప్రమాదకరమైన పరిస్థితుల్లో గిజగిజలాడుతోంది. ముందుముందు మరింత భయంకరంగా మారుతుంది. మన సంతానం మాట అటుంచి, జీవితాంతంలో మనకు కూడూ గుడ్డా దొరుకుతుందా? అనే పెనుభూతం మానవకోటిని కుడివేస్తోంది. ప్రపంచమంతటా ఇదే పరిస్థితి,




ఈ భూమిమీద 1850 వరకు నూరుకోట్ల మానవజాతి నివసిస్తూవుండేది. 1962కి ప్రపంచ జనాభా మున్నూరుకోట్లను దాటింది. మరో పన్నెండేళ్లలో నాలుగువందల కోట్లకు పైబడుతుంది. ఆతర్వాతి దశాబ్దంలో ఏడువందల నలభైకోట్లు!

జనాభా ఇలానే పెరుగుతూవుంటే- 2070వ సంవత్సరంనాటికి ఒక్కో మనిషి నివసించడానికి ఒక చదరపు గజం భూమిమాత్రమే లభ్యమవుతుందని అంచనా! ఉండడానికే ఒక్కో చదరపు గజం మిగిలితే, మరి తిండిమాటేమిటి?

ఆదాయం పెరగడంలేదు. ఫలసాయం దక్కడంలేదు. ఒకవైపున యుద్ధాలు, మరోవైపున కరువు కాటకాలు. తిండిగింజలు దొరకడంలేదు. కొన్నిచోట్ల మంచినీళ్లు కూడా కరువైపోయాయి. నిత్యావసరాల ధరలు పెరిగిపోతున్నాయి. ప్రజలు మాడిపోతున్నారు.

మనదేశం జనసంఖ్య ఇప్పుడు యాభై కోట్లు. ప్రతిగంటకి 1,300 శిశువులు



పిల్లలు ...

## సంతాన నిరోధం

జన్మిస్తున్నారు. యాభై ఏళ్ళక్రితంకంటె ఇప్పటి శిశుమరణం యాభై శాతం తక్కువ. పుట్టినవాళ్ళూ, పుట్టబోయేవాళ్ళూ తమ పొట్టనెలా పోషించుకుంటారు ? ఎలా. . ?

దినదినానికీ పెరిగిపోతున్న ఇటువంటి జనాభా పెరుగుదల ప్రపంచ మంతటినీ భయకంపితం చేసింది. సాంఘిక — ఆర్థిక పరిస్థితులదృష్ట్యా, మానవసంక్షేమం దృష్ట్యా, ఈ పెరుగుదలను అరికట్టడానికి అన్నిరంగాలవారూ నడుంకట్టారు.

'అమ్మాయిలు పెళ్ళికి తొందరపడి పోతున్నారు, వాళ్ళ వయోపరిమితిని పెంచాలి చట్టబద్ధం చేసెయ్యాలి. అప్పుడుగాని జనసంఖ్య మనమాట వినిపించుకోదు' అంటున్నది మన భారత కుటుంబ నియంత్రణ సంఘం. మరి, దీనికి అమ్మాయిలు ఏమంటారో చూడాలి !

పిల్లలు పుట్టగానే సరదా కాదు వారందరికీ తిండానికి తిండికావాలి కట్టుకోడానికి బట్టకావాలి ఉండడానికి నివాసం కావాలి. అన్నిటినిమించి తలిదండ్రుల ప్రేమకావాలి. పిల్లలెక్కువయేకొద్దీ ఇవన్నీ కరువైపోతుంటాయి!

కుటుంబాలు పెరిగేకొద్దీ ఎదురయ్యే జటిల సమస్యల్ని అర్థంచేసుకుంటున్నారు ప్రజలు పరిమిత కుటుంబాల అవసరాన్ని గుర్తిస్తున్నారు.

'మాకు ఒక అబ్బాయి, అమ్మాయి చాలు బాబు' అంటున్నారు కొందరు 'ముగ్గురితో సరిపెట్టుకుంటాము' అంటున్నారు మరి కొందరు 'అంతకంటె ఎక్కువయితే మీపాట్లు మీకున్నాయి చూసుకోండి' అంటోంది ప్రభుత్వం.

కుటుంబాలు పరిమితిగా ఉంచుకోవాలని ఎప్పుడైతే అనుకున్నారో, అప్పుడే సంతాన నిరోధంకోసం అనువైన సాధనాలు అనేకం రావడం మొదలెట్టాయి కండోమ్స్, డయాఫ్రమ్స్, జెల్లీస్, ఫోమ్ టాబ్లెట్స్, ఫాలోపియన్ ట్యూబ్స్, వేసక్టమీ, లూప్— ఇవన్నీ ఇప్పుడు వ్యాప్తిలో వున్నవే.

అసలు గర్భనిరోధం అనేది క్రీస్తుకు పూర్వంనుంచీ అమల్లో వుండేదని శాస్త్రకారులంటున్నారు. అంటే, జనాభా గురించిన భయం అప్పటినుంచీ వుందన్నమాట !

బహిష్టు తర్వాత, పదినుండి పద్ధెనిమిదిరోజులవరకు ఫలవంతమైన కాలంగా పేర్కొనడం రక్షణకాలం జరిగింది. 5 నుండి 9 వ రోజువరకు, 19 నుండి 28 వ రోజువరకు గర్భధారణ గురించి అంతగా భయపడవలసిన పని లేదు. ఇది రక్షణకాలం.



వనితలకు వరప్రసాదం 'ఒవులెన్' మాత్రలు

★

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం॥





# జనాభా సమస్య

రోమన్ కాథలిక్కులు ఈ నియమాల్ని పాటిస్తూ కుటుంబాల్ని పరిమితం చేసుకుంటున్నారుటకూడా!

**అవిశ్వాసమూ, భయమూ**

గర్భనిరోధక సాధనాలన్నిటిలోను మేలైనది 'లూప్' అని మన ప్రభుత్వం ప్రచారం చేస్తూవుంది. అయితే అందుకు ఆడవాళ్లంతా (పెళ్లయినవాళ్లే సుమా!) సముఖంగా వున్నట్లు కనిపించదు. లూప్‌తో వున్న బాదరబందీ పడలేకపోతున్నారు. దానిలోని శక్తిని ప్రజలకు ఎంతబాగా ఎరిగించినా, ఆదరణ అంతగా లభించడంలేదు.

గర్భనిరోధక సాధనాలను జనం నిరాదరించడానికి కారణం ఉపయోగించడంలోని చికాకు కొంత, మూఢవిశ్వాసాలు కొంత. డాక్టర్లు ఎంతగా అభయహస్తమిచ్చినా ఏమో ఏమవుతుందోననే భయం మరింత. ప్రజల్లో ఈరకమైన భావాల్ని తొలగించినప్పుడు కుటుంబనియంత్రణం సమస్య అవదు!

**సంతాన నిరోధానికి వరప్రసాదం 'ఒవులెన్'**

గర్భనిరోధక 'సాధనాలు' అన్నీ చికాకుగానే వుంటాయి. ఔషధాలు ఒకమాదిరిగా ఫరవాలేదు. ఇప్పుడొక దివ్యౌషధం భారతదేశానికి దిగివచ్చింది. అది ఒక మిల్లీగ్రాం చిన్నమాత్ర. దానిపేరు 'ఒవులెన్.' సంజీవిలా పనిచేస్తుంది. 'శీర్లె (ఇండియా) లిమిటెడ్' వారి తయారీ.

నూటికి నూరుపాళ్ళు లక్షణంగా పనిచేస్తుందని, నిర్భయమైన ఔషధమని అనేకమంది డాక్టర్లు ఋజువుచేశారు.

పెసరబద్ద ప్రమాణంలో పంచముఖిగా తెల్లగా వుంటుంది మాత్ర. గర్భనిరోధంలో అనేక ప్రయోగాలుచేసిచేసి చివరికి ఈ ఔషధాన్ని తయారుచేశారు శీర్లె అండ్ కంపెనీవారు. ప్రపంచమంతా వారికి ఋణపడివుంటుంది.

ఒక ప్యాకెట్‌లోను 21 మాత్రలుంటాయి. ఉపయోగించటం కూడా చాలా తేలిక. రోజుకు ఒకమాత్ర చొప్పున మూడువారాలు వరసగా లోపలికి తీసుకోవాలి. ఒకవారం విశ్రాంతి. మళ్లీ మూడువారాలు...

'ఒవులెన్' మాత్రవల్ల హాని ఏమాత్రమూ వుండదని డాక్టర్లందరూ ఏకగ్రీవంగా చెబుతున్నారు. ఎన్నో సంవత్సరాల నుండి ప్రపంచంలోని సుమారు ఎనభై ప్రాంతాలవారు దీనిని వాడుతున్నారు. ఉపయోగిస్తున్న ఏమహిళా వీటివల్ల ఫలానా చెడుగుణం వుందని ఇంతవరకు చెప్పలేదు.

ఈమాత్ర పనిచేసే విధమే ఒక అద్భుతం. లోపలికి పుచ్చుకోగానే రక్తంలో జీర్ణమైపోయి ఒకరకంగా కృత్రిమ గర్భాన్ని ఏర్పరుస్తుందన్నమాట! మాత్ర తీసుకున్నంతకాలమూ అలానే రక్షణనిస్తూ వుంటుంది.

ఈమాత్ర శక్తిని పైపూతకు అనువర్తింపచేయాలని చాలమంది పరిశోధకులు వృథాప్రయాస పడ్డారుట!

కొత్తగా పెళ్లయినవాళ్లకు 'ఒవులెన్' ఒకవరం!

ఇది బహిష్టు కాలాన్ని సక్రమం చేస్తుందని, ఆరోగ్యాన్ని సంరక్షిస్తుందని, ప్రయోజనం పొందిన స్త్రీలు అన్నారు. అంతేకాకుండా కేన్సర్ నుంచి రక్షణనిస్తుందని డాక్టర్లు చెప్పారు. మాత్రపుచ్చుకుని పుచ్చుకుని మానేస్తే కవలపిల్లలు పుడతారనేది అబద్ధమని నిరూపించింది 'టయిమ్' మాగజైన్.

ఒకనెల గనుక ఈమాత్రలు పుచ్చుకుంటే దానికదే అలవాటైపోతుందని, విడిచివుండలేరని వాడుతున్నవాళ్ళు అంటున్నారు.

మహిళా లోకానికి ఈమాత్ర అభయహస్తం! పిల్లలు అక్కరలేదనుకున్నప్పుడు తగ్గించుకోవచ్చు. కావాలనుకున్నప్పుడు అభీష్టాన్ని నెరవేర్చుకోవచ్చు. వనితలకిది వరప్రసాదం కాకపోతే మరేమిటి?

**దివ్యౌషధం దొరికిందిగా,**

ఇప్పుడు మన కుటుంబాల్ని పరిమితం చేసుకోవడం సమస్యకాదు. ప్రభుత్వం తలప్రద్దలు చేసుకోనక్కరలేదు. పెళ్లికి అమ్మాయిల వయస్సు పెంచక్కరలేదు. ఇరవైవకటవ శతాబ్దంలో గజంనేల సమస్య వుండనే వుండదు.

యూనివర్సిటీలోని అవివాహిత విద్యార్థినులు, 'ఈమాత్రలు మాకు సునాయాసంగా లభించే ఏర్పాటుచేయాల'ని కోరుతున్నారుట! —ఇది ఆస్ట్రేలియాలో చర్చనీయాంశంగా వుంది. ●

FAMINE RELIEF FUND : Rs 1000 · 1st ANNIVERSARY OFFER · LitQuiz No. 18

FIRST PRIZE Rs 12500 · TRANSISTOR FOR EVERY ALL CORRECT WINNER MINIQUIZ

RUNNERS-UP: UPTO 4 ERRORS + MINIQUIZ: UPTO 2 ERRORS

Rs. 25,000

## Official Entry Form of Litquiz No. 18

LITQUIZNo.18, ALANKAR, BALARAM ST. BOMBAY-7 (WB)

Note:—(1) Strike out with ink in each column the word you have rejected. (2) Cancel the second coupon if you send only one coupon. (3) If you send Entry fee by M O you MUST enclose with this Entry Form the M.O. Receipt you get from post office. Entries without M.O. Receipt will be disqualified. (4) Do not Cross I. P. O. Make it payable to Litquiz No. 18 at Bombay. 7.

| 1 Re. 1 | | | 2 Re. 1 | | |
|---|---|---|---|---|---|
| 1 | ACTIVE | SENSITIVE | 1 | ACTIVE | SENSITIVE |
| 2 | ACTIVELY | PASSIVELY | 2 | ACTIVELY | PASSIVELY |
| 3 | ART | CULTURE | 3 | ART | CULTURE |
| 4 | BENEFITS | SUFFERS | 4 | BENEFITS | SUFFERS |
| 5 | BREAK | WIFE | 5 | BREAK | WIFE |
| 6 | COUNTRY | DUTY | 6 | COUNTRY | DUTY |
| 7 | CULTURE | LITERATURE | 7 | CULTURE | LITERATURE |
| 8 | DEMOCRACY | SPIRITUALITY | 8 | DEMOCRACY | SPIRITUALITY |
| 9 | DESTINY | HISTORY | 9 | DESTINY | HISTORY |
| 10 | ECONOMIC | PUBLIC | 10 | ECONOMIC | PUBLIC |
| 11 | GENIUS | GREAT | 11 | GENIUS | GREAT |
| 12 | GREAT | PERFECT | 12 | GREAT | PERFECT |
| 13 | HAPPINESS | SUCCESS | 13 | HAPPINESS | SUCCESS |
| 14 | IDEALS | RELIGIONS | 14 | IDEALS | RELIGIONS |
| 15 | INSPIRATION | REVELATION | 15 | INSPIRATION | REVELATION |
| 16 | LANGUAGE | LITERATURE | 16 | LANGUAGE | LITERATURE |
| 17 | RATIONAL | SPIRITUAL | 17 | RATIONAL | SPIRITUAL |

18 SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE

MINIQUIZ — 10 clues FREE coupon

| ACTIVE | SENSITIVE | DESTINY | HISTORY |
|---|---|---|---|
| ACTIVELY | PASSIVELY | ECONOMIC | PUBLIC |
| BENEFITS | SUFFERS | HAPPINESS | SUCCESS |
| COUNTRY | DUTY | LANGUAGE | LITERATURE |
| DEMOCRACY | SPIRITUALITY | RATIONAL | SPIRITUAL |

**18** (ASVP)

In entering this Quiz I agree to abide by the Rules & Conditions and accept Competition Editor's decision as final and legally binding. Entry fee for each one coupon is Re 1. Entry fee for this complete Entry Form (of 2 coupons) is Rs. 2. I enclose M.O. Receipt/I.P.O./Litquiz Cash Receipt/Prize Card and its number is...

CAPITAL LETTERS

NAME ..............................................

ADDRESS ..............................................

..............................................

Cut out and send this complete Form

Final Closing Date: 6-7-67
Solution in Bharat Jyoti: 9-7-67
Result in Bharat Jyoti: 23-7-67

*Send with your entries a self-addressed 6 Paise post card to receive Solution immediately.

*Latest issue of Litquiz Weekly will be sent Free on request.

### 17 CLUES

1. Psychologically it is felt that a child is innately Active/Sensitive. 2. Under normal conditions, mind works Actively/Passively and in an un-controlled way. 3. Art/Culture makes the greatest progress and yields the best results when it is pursued in a catholic spirit and in an atmosphere of freedom. 4. If the present generation is made to sacrifice necessaries, the future generation naturaly Benefits/Suffers. 5. A good Break/Wife can make a man, a bad one can break him. 6. Devotion to Country/Duty should be harmonised with devotion to humanity. 7. Culture/Literature is, indeed, the mirror of life in all its colours and phases, in all times. 8. Democracy/Spirituality and starvation ill go together. 9. Ideas and ideals are very great determinants of human Destiny/History. 10. When men without high religious principle control a people's Economic/Public life, that life goes to corrpution and ruin fast as canker kills the flower's bloom 11. Genius would not be Genius/Great if it were not unconditioned. 12 He is an ignorant, imperfect man who aspires to become Great/Perfect. 13. A man must labour hard previous to attaining Happiness/Success. 14 History has offered evidence of the fact that different Ideals/Religions have influenced humanity at different stages of its development. 15 It is strange how great Inspiration/Revelation comes sometimes from matters of no moment. 16. Language/Literature grows with the thought and the dynamic living of the people. 17. An awareness that there is a divinity that shapes our ends and ends our shapes too is the beginning and end of all true Rational/Spiritual thinking

NOTE: The above clues are quotations reproduced from the works of authors and writers. They are complete sentences and are also independently complete in sense. Names of Authors/Writers and their Works will be published along with the official solution in Liquiz Weekly.




‘అట్లుకు పిండి అయిపోయింది. వుప్మా వేయించమంటారా?’ అని ‘సరుకు మాష్టరు’ అడిగిన దానికి—

‘వేయించవయ్యా! ప్రతిదానికీ నన్నడుగుతావెందుకు? అట్లు అయిపోతే వుప్మా వెయ్యాలని తెలియదు? రోజూ కొత్తా!’ అని విసుక్కుంటూ అన్నాడు హోటల్ ‘త్రిమూర్తిభవన్’ ప్రొప్రయిటర్ కనకయ్య.

ఎప్పుడూ లేనిది ఇవాళ యజమాని ఇంత చిరాకుగా వున్నాడేమిటా అని ఆ సరుకు మాష్టరు ఆశ్చర్యపోయాడు. మారుమాటాడకుండా లోపలికెళ్ళిపోయాడు.

కనకయ్య బీడితీసి వెలిగించాడు. ఛీ ఛీ, అంతా వెధవలు దొరికారు. ఒక్కడికీ తెలివి కాయ లేదు. ప్రతిదానికీ తనని అడగటమే నని విసుక్కున్నాడు.

అప్పుడు సాయంత్రం నాలుగు గంటలయింది. హోటల్ ‘త్రిమూర్తిభవన్’ రద్దీగా వుంది. జనం వస్తున్నారు. ఫలహారాలు తిని కాఫీలు త్రాగుతున్నారు. బిల్లులు చెల్లించిపోతున్నారు. కనకయ్య కేష్‌లో కూర్చుని బిల్లులు తీసికుంటు న్నాడు.

ఆ వూళ్ళో ‘త్రిమూర్తిభవన్’కు మంచి డిమాండ్ వుంది. బస్సు స్టాండింగ్‌కు దగ్గరలో ఈ హోటల్‌ను కొట్టే హోటలే లేదు. బస్సులకెళ్ళేవాళ్ళే కాకుండా వూళ్ళో జనం కూడ చాలమంది ఆ హోటల్‌కే వస్తారు. సైకి పేరుకు బోర్డుమీద ‘త్రిమూర్తిభవన్’ అని వుంటుంది. కాని అంతా కనకయ్య హోటల్ అనే అంటారు. కనకయ్య హోటల్‌లో అన్నివేళలందూ వేడి వేడి యిడ్లీలు దొరుకుతాయి. వుల్లిపాయ పెసరట్టుకు కనకయ్య హోటల్ పెట్టింది పేరు!

కనకయ్య అనే పేరునుబట్టి అతను వయస్సుమళ్ళిన వ్యక్తి అని అనుకుంటు న్నారా? కాదు. కనకయ్య యువకుడే! అతని వయస్సు 33—35 సంవత్సరాలకంటె ఎక్కువుండదు. ఆవయస్సుకే అతను మంచి వ్యాపారదక్షత గలవాడయ్యాడు. ఆ హోటల్‌మీద మంచి లాభాలు తీశాడు. ఈరోజతని దగ్గర పదిహేనువేలవరకు రొక్కం వుంది. ఒక పక్కా డాబా వుంది. ఇదంతా ఈ హోటల్‌మీద, వుల్లిపాయ పెసరట్లుమీద సంపాదించిందే!

అసలు ఈ హోటల్ పూర్వం, అంటె 7సం. ల క్రితం, ఒక తాటాకుల పాకలో వుండేది. అప్పుడు యింతమంది సర్వర్లు లేరు; అసలు సర్వర్లు వుండేవాళ్ళుకాదు. అన్నీ కనకయ్యే చూచుకునేవాడు. పెనం దగ్గర కూర్చుని అట్లు వేయటం, పేసింజర్సుకు కాఫీ ఫలహారాలు అందించటం, డబ్బులు తీసికోవటం, పిండి రుబ్బుకోవటం—అన్నీ కనకయ్యే స్వయంగా చేసుకునేవాడు. పోతే ఎంగిలిప్లేట్లు, గ్లాసులు తీసేందుకు మాత్రం చేతిక్రింద ఒక కుర్రవాడుండేవాడు. ఇలా వుండగా, ఆ పాకకు ఎదురుగా ఆర్. టి. సి. బస్సుస్టాండింగ్ పడింది. దానితో కనకయ్య దశ మారింది.

కనకయ్య పాక హోటల్‌కు డిమాండ్ పెరిగింది. నెల అద్దెకు తీసికున్న పాక స్థలాన్ని స్వంతంగా కొనేశాడు. దాని మీద త్రిమూర్తిభవన్ వేసాడు. పెనం దగ్గిర కూర్చుని అట్లువేసే కనకయ్య ఇవాళ్టిరోజున క్యాష్‌లో కూర్చుని బిల్లులు తీసికుంటున్నాడు. ఇప్పుడా హోటల్‌లో ఖరీదయిన ఫర్నీచర్ వుంది. పన్నెండు మంది సర్వర్లు, ఆరుగురు క్లీనర్లు, లోపల సరుకులు తయారు జేయటానికి మరో ముగ్గురు పనివాళ్ళు, లెక్కలు రాసే గుమస్తా వున్నారు.

కనకయ్య ఈ హోటల్ మీద తీసిన లాభాలతో ఊళ్ళో తను వుండటానికి ఒక చక్కని మేడ కట్టించుకున్నాడు; ఒక అందమైన పిల్లను పెళ్లిచేసుకున్నాడు. ఆ పిల్లకెన్నో ఖరీదయిన చీరలు కొన్నాడు; నగలు చేయించాడు. ఆ పిల్ల యింటిపని చేసుకోలేదని ఒక వంట మనిషిని, యిద్దరు నౌఖర్లను పెట్టాడు. ఆ పిల్ల మనాది పెట్టుకుంటుందని చెప్పి ఆమె పుట్టింటి తరఫు వాళ్లంతా పిల్లతోపాటు కనకయ్య యింటికి కాపురానికొచ్చారు!

కనయ్య ఇవాళ రేపట్లో ఒక కారు కూడ కొనాలని ప్రయత్నిస్తున్నాడు.

...జేబులోంచి మంగుళూరు బీడికట్ట తీసి ఒక బీడి వెలిగించాడు. ఆవులిస్తూ కనకయ్య హోటల్ బయటికి చూశాడు.

హోటల్ ముందు కూర్చుని అడుక్కునే కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు హోటల్‌కొచ్చే పాసింజర్లను ధర్మం చేయమంటూ జలగల్లాగా పట్టుకుంటున్నారు. ధర్మం చేసే వాళ్ళు చేస్తున్నారు; లేదు పొమ్మని కసిరి కొట్టేవాళ్ళు కసిరి కొట్టుతున్నారు.

కనకయ్య ఈ దృశ్యాన్ని చూశాడు. అసలే ఆ రోజు చికాకుగావున్న కనకయ్యకు తిక్కరేగింది. ముష్టివాళ్ళమీద పట్టలేని కోపం ముంచుకొచ్చింది.

'అరేయ్ ముత్తిగా, అలా ఆ గుమ్మంలోనే వుండిపోయారేమిట్రా? ఇట్లా లోపలికొచ్చి, కాఫీలు త్రాగుతున్న పాసింజర్ను చొక్కాలు పట్టుకుని దబాయించి మరీ అడగండిరా!...' అని అరిచాడు.

ఆ ముష్టివాళ్ళల్లో ముత్తిగాడన్నవాడు కుంటివాడు; ముసలివాడు. కనకయ్య ఈ హోటల్ పెట్టిన దగ్గర్నుంచి యిక్కడే కూర్చుని అడుక్కుంటున్నాడు. వాడ్ని చూస్తే కనకయ్యకు ఒక విధమైన అభిమానమే! అప్పుడప్పుడు పండుగలకు పబ్బాలకు వాడికి మిగిలిపోయిన అన్నం, సాంబారు పోయిస్తూ వుంటాడు.

ఇప్పుడు కనకయ్య కోపంగా అన్నమాటలకు ముత్తిగాడు చిన్నబుచ్చుకున్నాడు. ఈ 6, 7 సంవత్సరాల్లో తనకి తెల్సినంత వరకు కనకయ్య ఎప్పుడూ యిలా విసుక్కుని వుండలేదు.

ముత్తిగాడు మెల్లగా, 'ఏం లేదు దొరా...' అని అన్నాడు.

'ఏం లేదురా? వచ్చేవాళ్ళమీద అలా పడి అడుగుతుంటే హోటల్‌కొచ్చే పాసింజర్స్ ఎలా వస్తారురా?' అని కనకయ్య నిష్ఠూరంగా అన్నాడు.

కనకయ్య ఆరిపోయిన బీడీని అవతలకి విసిరేసి, ఒక సర్వరును పిలిచి ఒక స్ట్రాంగ్ టీ పట్టుకురమ్మన్నాడు. ఆ సర్వరు వెంటనే ఒక టీ స్పెషల్‌గాచేసి తీసికొచ్చాడు.

కనకయ్య టీ త్రాగుతుంటె అక్కడే నిలబడ్డ సర్వరు తల గోక్కుంటూ ఏదో చెప్పాలన్నట్టుగా, 'సార్!' అన్నాడు.

'ఏం?' అని అడిగాడు కనకయ్య.

ఆ సర్వరు సిగ్గుపడుతూ మెల్లగా, 'పెళ్ళి చేసుకోబోతున్నా సార్—' అన్నాడు.

'మంచిదే!'

'రెండు నెలల జీతం అడ్వాన్సు యిప్పించండి సార్!'

అసలే విసుగ్గావున్న కనకయ్యకు చర్రున కోపం ముంచుకొచ్చింది.

'రెండునెలల అడ్వాన్సు కావాలా? ఏం జూసి ఇవ్వమంటావోయ్? మీకా సర్వర్లకు ఒక హోటల్ అనేముంది? ఇవాళ ఈ హోటల్‌లో వుంటారు. రేపు ఇంకో హోటల్‌కు పోతారు. మీ మీద ఎలా పెట్టుబడి పెట్టమంటావోయ్?...అడ్వాన్సు లేదు, ఏంలేదు. వెళ్ళి నీపని చూస్కో!' అని కసురుకున్నాడు.

పాపం, ఆ సర్వరు మారు మాటాడకుండా వెళ్ళిపోయాడు.

కనకయ్య బీడి వెలిగించాడు...ప్రతివాడూ డబ్బు అడిగేవాడే! మరి తనేం డబ్బు కుప్పలుపోసి కూర్చున్నాననుకుంటారేమో! ఇందాకమటుకు ఇందాక 'ఆయన' వచ్చి ఒక వెయిరూపాయలివ్వమన్నాడు. ఏదో వ్యాపారల పెట్టుకుంటానని. వెయ్యి రూపాయలు! ఈ కరువురోజుల్లో వెయ్యి రూపాయలంటే మాటలా? అసలు తనెందుకివ్వాలి? ఏం జూసి ఆయనకు వెయ్యి రూపాయలిస్తాడు? తనకు స్వయాన అన్నే అవుతాడు. అన్న అయినంతమాత్రాన వుచితార్థంగా చూస్తూ చూస్తూ వెయ్యి రూపాయలెందుకివ్వాలి? ఇస్తాడు...మళ్లీ తిరిగి యిస్తాడని గ్యారంటి ఏముంది? నీళ్లు వదులుకోవల్సిందేగా?

...ఈరోజు కనకయ్య అంత చికాకుగా వుండటానికి, అందరిమీదా అలా విసుక్కోవటానికి అసలు కారణం వాళ్లన్నయ్య వెయిరూపాయి లడగటం! ఆ రోజు మధ్యాహ్నం కనకయ్య అన్న భూషయ్య హోటల్‌కొచ్చాడు. ఒక వెయిరూపాయిలు అప్పుగా అడిగాడు. ఆడబ్బుతో రెండో మూడో రిక్షాలు కొని బాడుగకు యిచ్చుకుని వాటి అద్దెమీద వచ్చేడబ్బులో అప్పు తీర్చుకుంటాను అన్నాడు. ఈ అడగటం వుత్తరాల ద్వారా రెండుమూడు నెలలుగా అడుగుతూనే వున్నాడు. ఒక్క ఉత్తరానికీ కనకయ్య సమాధానం ఇవ్వకపోవటంవల్ల ఈరోజు భూషయ్యే వూరునుండి స్వయంగా వచ్చాడు. తనకి సహాయం చేయమని నోరుతెరచుకుని తమ్ముణ్ని అడిగాడు. నాదగ్గర డబ్బేమీ లేదు, నన్ను వూరికే అడగవద్దని కనకయ్య నిర్మొగమాటంగా, కరాకండిగా చెప్పేశాడు.

ఇక అడిగి లాభంలేదనుకున్న భూషయ్య వెళ్లబోతూ ఒకమాట అని మరీ వెళ్ళాడు. 'నేను లోగడ చేసిన సాయాన్ని మరిచిపోయావన్నమాట!' అని అన్నాడు.

ఆరోజు కనకయ్య చికాకుకు, విసుగుకు కారణం భూషయ్య అన్న ఈ మాటే!

కనకయ్య బీడిదమ్ములాగుతూ ఇలా ఆలోచిస్తున్నాడు—

ఆ రోజుల్లో తను వూళ్ళో, పేటల్లో తిరిగి ఉదయంపూట యిడ్లీలు, మధ్యాహ్నాలు 'కుంపటి కాఫీ' అమ్ముతుండేవాడు. కొన్నిరోజులకు, ఇలా వూళ్ళో తిరిగేదానికంటె ఎక్కడయినా ఒక చిన్న కాఫీ దుకాణం పెట్టుదామనిపించింది. ఎంత పాకలోపెట్టినా పాత్రసామాను కొనాలంటే 50 రూపాయలన్నా పెట్టుబడి కావాలి.

భూషయ్యను డబ్బు అడిగాడు. కాని అంత డబ్బు భూషయ్యదగ్గరమాత్రం ఎక్కడుంది. అతని పరిస్థితి అంతంత మాత్రంగానేవుంది. ఆ రోజుల్లో భూషయ్య కూరగాయల కావుళ్ళు పట్నంలో అమ్ముతుండేవాడు. తమ్ముడికి సహాయం చేయాలని తన భార్య మెడలోవున్న వెండికంటె, తనచేతి మురుగులు అమ్మి కావల్సిన డబ్బుయిచ్చాడు. ఆ డబ్బుతో ఒకపాకలో చిన్న కాఫీ దుకాణం పెట్టాడు. తన అదృష్టం బాగుంది. దేముడు చల్లగా చూశాడు. ఆనాటి పాక ఈరోజున 'త్రిమూర్తి భవన్' అయింది.

...అవును, ఆరోజు తను హోటల్ పెట్టటానికి ఆయన సహాయం చేశాడు. ఎవరు కాదన్నారు? దానికి తగిన ప్రతిఫలం తానెప్పుడో ముట్టజెప్పాడు. అత్తగారి వూరుపోయి పొలాలు కౌలు చేసుకుంటానని ఈ వూరొదలిపోతున్నప్పుడు రెండొందలిచ్చి పంపాడు. ఆయన తనకని మహాసహాయం చేస్తే అంతాకలిసి ఒక వందచేసివుంటాడు. దానికి రెట్టింపు యిచ్చాడు కదా! అవూళ్ళో కౌలుచేసుకుంటూ ఏమయినా బాగుపడ్డాడేమోననుకుంటే, వర్షాలులేక రెండేళ్ళనుండి పంటలు దెబ్బతిన్నాయని, పరిస్థితి బాగాలేదు ఏమయినా సాయం చేయమని రెండునెలలనుండి వుత్తరాలమీద వుత్తరాలు రాస్తున్నాడు. ఎప్పుడో తనకు సాయం చేశాడని ఇక బ్రతికినంతకాలం ఈ ముదుపులు ఎక్కడ చెల్లించుకుంటాడు. అందుకే, ఒక్క ఉత్తరానికీ సమాధానమియ్యకుండా తానూరుకున్నాడు. ఇవాళ తానే స్వయంగా వచ్చాడు. డబ్బు అడిగాడు. లేదనేటప్పటికి మొగం ఇంతజేసుకున్నాడు. 'నేనాంోజున చేసిన సాయం మర్చిపోయావన్నమాట' అని విష్ఫూరంగా అన్నాడు.

బాగుపడే దశ వుంటె ఎలాగయినా బాగుపడతాడు. ఆ రోజాయన డబ్బు యివ్వకపోతే భగవంతుడు ఇంకోవిధంగా చూచేవాడు. తానింకోవిధంగా బాగుపడేవాడు. ఎవరి అదృష్టం వాళ్ళది! మధ్యన ఈయన చేసిందేమిటి? చేసిన దానిని అప్పుడే యిచ్చుకున్నాడుగా! ఆయనికి తాను డబ్బుయిచ్చిన దొక్కటే కనిపిస్తుంది. కాని, తాను పడ్డ కష్టం? పిండి రుబ్బేడు. పెనం దగ్గర కూర్చుని అట్లువేశాడు. అంట్లు తోముకున్నాడు. ఎంగిలి ప్లేట్లు, గ్లాసులు కడుక్కున్నాడు. తిన్న రోజులూ వున్నాయి, తినని రోజులూ వున్నాయి. మరి ఈ కష్టమంతా ఎవరు పడ్డారు? తానొచ్చి పడ్డాడా? ఆ రోజున తాను కష్టపడ్డాడు. దేముడు చల్లగా చూశాడు. ఈ రోజున ఇంత సంపాదించుకుని సుఖపడుతున్నాడు. దీనికి మధ్యలో ఒకళ్ళు వరగపెట్టిందేమిటి? ఇదెవరి భిక్షా కాదు! తన కష్టార్జితం ఇవాళ డబ్బున్నదని అందరికీ పంచిపెట్టుతూ కూర్చుంటె రేపు తనకి లేనప్పుడెవరిస్తారు? వచ్చేరోజూ వుంటుంది— రాని రోజూ వుంటుంది. తనకి మాత్రం పెళ్ళాం బిడ్డలులేరు. వాళ్ళ కోసం ఇంత వెనకేసుకోవద్దూ?

* * *

ఆరు గంటలవుతుంది. సన్నసన్నగా చీకటి పడుతుంది. దీపాలు వెలిగాయి. కనకయ్య సర్వర్లను ఒక్కొక్కడినే పిలిచి ఆ రోజు బత్తాలిచ్చాడు. పాలు పొయ్యిచేసే వీరాస్వామి వచ్చాడు. పాలు బాగుండటంలేదని నాలుగు కేకలేసి డబ్బుయిచ్చి పంపాడు.

హోటల్‌కు వచ్చే జనం రద్దీ తగ్గిపోయింది. అయిదు నిమిషాలకు, పదినిమిషాలకు ఒకళ్ళు వచ్చి కాఫీ, టీ త్రాగిపోతున్నారు. కనకయ్య ఒక కాఫీ తెప్పించుకుని త్రాగి ఇంకో బీడి వెలిగించాడు. బీడి పొగ వదులుతూ రోడ్డు వంక చూశాడు. ముష్టి ముత్తిగాడు తన వంక జాలిగా చూచినట్లనిపించింది. కనకయ్యకు వాడిమీద జాలివేసింది. ఇందాకా వాడ్ని అనవసరంగా కేకలు వేశాడు. పాపం, వీడేం చేస్తాడు? వెధవది ఇందాక వచ్చిన చిరాకుతో తనకేమీ తోచలేదు అనుకున్నాడు.

హోటల్ ముందు కూర్చున్న ముష్టి వాళ్ళు జోలి, డబ్బా, కర్ర సర్దుకుని ఇకా రోజుకు గుడిశలకు పోవటానికి సిద్ధమవుతున్నారు. ఆ రోజు వాళ్ళ సంపాదనను లెక్కలు చూచుకుంటున్నారు. ముత్తిగాడు తన కొచ్చిన చిల్లర పైసలన్నీ లెక్క పెట్టుకున్నాడు. ఎనభై పైసలు వచ్చాయి. తన ప్రక్కనె కూర్చున్న గుడ్డి నాగడికి ఆ రోజు 20 పైసలే!

ముత్తిగాడు, 'ఎంత సంపాయించావురా మనమడా!' అని నాగడ్ని అడిగాడు.

నాగడు కుర్రవాడే! వయస్సు పాతిక లోకే వుంటుంది. వాడికి పుట్టు గ్రుడ్డి. పయిగా ఈ మధ్య వాడికి కుష్టు కూడ పొడజూపింది. నాగడు ఎక్కడ్నుంచి వచ్చాడో ఒక పదిరోజుల్నుంచి ఈ హోటల్ ముందు ముత్తిగాడి ప్రక్కనే కూర్చుంటున్నాడు. వాడి దురదృష్టమేమిటో కాని వాడికెవ్వరూ ధర్మం వెయ్యరు. రోజంతా కూర్చుంటె పది పైసలు, ఇరవై పైసలు. అంతే! మరి, వాడి మొగం చూస్తే ఎవరికీ ధర్మం వెయ్య బుద్ధికాదో ఏమో!

ముత్తిగాడి కయితే ఎలా లేదన్నా రోజుకు రూపాయిదాకా వస్తుంది. వాడు వయస్సు మళ్ళినవాడు. ఈ హోటల్ ముందే 7 సంవత్సరముల నుండి కూర్చుంటున్నాడు. ఈ హోటల్‌కు రోజూ వాడికగా వచ్చే వాళ్ళందరూ వీడికీ తెలుసు. అందరికీ వీడు తెలుసు. వాడు నవ్వుతూ ధర్మం అడిగితే పాపమాన్యంగా ఎవరూ లేదనరు.

'అఁ ఎంత తాత, యిరువయ్ పైచలు' —నీరసంగా జవాబిచ్చాడు నాగడు.

'ఓ రెదవా, ఈ పయిచలొస్తే ఏం చేత్తావురా? నూకలు కూడ రావుగందరా?'

'టీ నీళ్ళు తాగి తొంగుంటా—మరేం సేత్తా?'

'ఏదో ఏడువ్— వేనట్టా ఎల్లి బీడి ముక్కొటి తెచ్చుకుంటా—'అని ముత్తిగాడు కర్ర పోటు జేసుకుని మెల్లగా లేచాడు.

కనకయ్య వీళ్ళవంక చూస్తూ వీళ్ళ మాటలు వింటున్నాడు. బీడికోసం ముత్తిగాడు లేవగానే, 'ఇదిగోరా ముత్తయ్య బీడి!' అని అన్నాడు కనకయ్య.

'వత్తన్నా దొరా!' అని ముత్తిగాడు కర్ర పోటేసుకుంటూ వెళ్ళి, కనకయ్య యిచ్చిన బీడి తీసికున్నాడు.

ముత్తిగాడు తిరిగి వస్తూ వస్తూ నాగడి 'బొచ్చెలో' ఎవరో లోపల్నుంచి వచ్చే వాళ్ళు ధర్మం వేస్తున్నట్లుగా, పైసలు వేశాడు.

నాగడు, బొచ్చెలో పడ్డ పైసలు చూసుకుని, 'సల్లగుండు దొరా!' అన్నాడు.

ముత్తిగాడు గుబురు గడ్డంలోంచి నవ్వుకున్నాడు. ప్రక్కనున్న బీడీ కొట్టు దగ్గర కెళ్ళి నిప్పుతాడుకు బీడి వెలిగించుకున్నాడు.

తను కూర్చునేచోటుదగ్గరికి వస్తూ (కర్ర శబ్దంకాకుండా) మళ్ళీ నాగడి

బొచ్చెలో పైసలు వేశాడు.

నాగడు చేతితో పైసలను తృప్తిగా తడుముకుంటూ మళ్ళీ, 'సల్లగుండు దొరా!' అన్నాడు.

ముత్తడు మళ్ళీ తృప్తిగా నవ్వుకున్నాడు.

తన మాములుచోటులో కూర్చుంటూ, ఏమీ ఎరగనట్లు, 'ఆఁ—ఏరా బుల్లోడా, మళ్ళీ సిల్లరపడ్డట్టుందే—' అని అన్నాడు ముత్తడు.

'అవునే తాత! యిప్పుడే ఎవరో యిద్దరు దొరలు పైచ వేశారు. ఆళ్ళకడుపులు సల్లగుండ—ఆళ్ళ బిడ్డపాపలు సల్లంగుండ—' అని తృప్తిగా, హుషారుగా అన్నాడు.

ముత్తడు గుడ్డివాడి బొచ్చెలో రెండు సార్లు ఎవరో వేసినట్లు పైసలువెయ్యటం కనకయ్య చూశాడు. ఒక ముష్టివాడు మరో ముష్టివాడికి పైసలు ధర్మం చెయ్యటం కనకయ్యకు అబ్బురమనిపించింది.

'మొత్తమెంత సంపాయించావురా? సూడ్నియ్—ఎంత—అర్ధరూపాయి—ఫర్లా, గంజినీళ్ళు కాసుకోవచ్చు—'

'అర్ధరూపాయివుంటె ఇంకేం—ఆ మారాజుల పేరుసెప్పుకుని కడుపునికా గంజినీళ్ళ తాగొచ్చు—'

'సరే, యింక నీ గుడిశకు పో—సీకటడింది—కాళ్ళ రద్దిగా వుంది—జెగర్తగాపో—' అని గుడ్డినాగడ్ని పంపించేశాడు, ముత్తిగాడు.

నాగడు చేతికర్రతో నేలమీద తట్టుకుంటూ తడుముకుంటూ రోడ్డువారగ నడిచిపోయాడు.

కనకయ్య, ముత్తిగాడ్ని చూచి—'ఏమిట్రా అది, వాడికి నీడబ్బు వేశావేమిటి?' అని కుతూహలంగా అడిగాడు.

'ఆడి బొంద—ఆడికి ధరమం ఎవరేత్తున్నారు దొరా? ఈయాళంతా ఎండలో కూసుని అడుక్కుంటుంటె ఆడికి ఇరువయ్ పైచలొచ్చాయి. ఈ పైచలుతో గంజి కాసుకుంటానికయినా నూకలగింజలు రావు. ఆడింకేటి తినిసత్తాడు? నాకు ఈయాళ ఎనభయి పైసలొచ్చాయి. అందులో ఆడికి ముప్పయిపైచలేశాను దొరా! సాటోడు పత్తుంటె సూత్తూ వూరుకుంటానికి పేణం వప్పుతుందా దొరా?' అని అన్నాడు ముత్తిగాడు.

కనకయ్యకి ఎవరో చెర్నాకోలతో కొట్టినట్లనిపించింది!

'సాటోడు ఏత్తుంటె సూత్తూ వూరుకుంటావా? నీకున్నదాంట్లో సాయం సేయవ్?' అని ఎవరో తన చొక్కాపట్టుకుని నిలేసి, దబాయించి అడుగుతున్నట్లనిపించింది.

'అవున్రా—మరి ఆయిచ్చే డబ్బులే వాడికిచెప్పి చేతికెందుకీయగూడదు? అలా ఎవరో ధర్మంవేసినట్లు వెయ్యటమెందుకు?' కనకయ్యగొంతు నీరసంగా నూతిలోంచి పలికినట్లుగా పలికింది.

మూత్తిగాడు గొళ్ళున నవ్వాడు; వాడి గొంతు ఖంగున పలికింది. 'ఓ ఆదా? ఆడికోరోగం! డబ్బులు నేనిత్తె తీసికోరా అంటె తీసికుపోవడు; నీకొచ్చేడబ్బులు నీకే సాలవ్—నాకేం యిత్తావంటాడు? ఎంత సెప్పినా ఇనుకోడు; తీసుకోడు. అందుకని ఈవారం మట్టి ఇట్టగే నేనే ఎవరో దరమం సేసినట్లు ఏత్తుండా! ఈ పైచల్తో నేనేవన్నా మేడలూ మిద్దెలూ కట్తానా? ఏందో దొరా—వెనక జన్మంలో ఏం పాపం సేశానో, ఇప్పుడు ఇట్టగయ్యా—ఈ జల్మంలోనన్నా కూత్తంత మంచిపని, భగమంతుడుమెచ్చే పనిసేత్తే ముందుకయినా మంచిది—వత్తా దొర్రా—'

ముత్తిగాడు చేతికర్ర పోటేసుకుంటూ నిర్విచారంగా నిండుగా రైలుస్టేషన్‌వయిపు పోతున్నాడు.

వాడెంత నిస్వార్ధజీవి!

మూత్తిగాడు, అయ్యా బాబు అని అందరిముందూ చేతులుచాపి అడుక్కున్న డబ్బుల్లోంచి, ఒకపూట గంజినీళ్ళకు కూడా చాలీచాలని డబ్బుల్లోంచి తన 'సాటోడు'కు ఎందుకు దానం చేశాడు??

వాడు మనిషి గనుక! వాడికి సాటివాడి కష్టాల్నిచూచి జాలిపడే గుండెవుంది గనుక!

మరి నీకు???

'బాబు, హారతి కళ్ళకద్దుకుంటారా?'

దేముడి పటాలకు శుక్రవారం పూజ చేసిన పంతులు హారతితెచ్చి కనకయ్య ముందుపెట్టాడు.

వెలుగుతున్న హారతిలో ఏదో సందేశం!

అందరూ హారతిని కళ్ళకద్దుకుంటారెందుకని? తను హరించుకుపోతూ, తను శూన్యమయి పోయేవరకూ మానవాళికి ఏదో శాంతిని, ధైర్యాన్ని, ప్రభోదాన్ని, భక్తిభావాన్ని ఇవ్వాలనే తాపత్రయంతో భగభగలాడి గిలగిలలాడిపోతుంది గనుక!

* * *

కనకయ్య తలఎత్తి చూశాడు. శ్రీరామచంద్రుడు, శ్రీనివాసుడు, ఆంజనేయస్వామి మల్లెపూలదండల వెనకగుండా తనని కనిపెట్టుతున్నట్లనిపించింది; తన గుండెల్ని చీలుస్తూ చూస్తున్నట్లనిపించింది. తనకేదో చెప్పుతున్నట్లనిపించింది.

కనకయ్య రెండుచేతులెత్తి నమస్కరించాడు. మూసినకళ్ల చివరల్లోంచి వేడి కన్నీరు బయటికి కుబుకుతుంది.

కనకయ్య ప్రక్కగదిలో లెక్కలురాసుకుంటున్న గుమాస్తాని పిలిపించాడు. 'రేపు ఈ అడ్రసుకని రెండువేలరూపాయలకు డ్రాఫ్టు పంపించండి. మర్చిపోవద్దు—' అని అడ్రసు కాగితం యిచ్చాడు.

'అలాగేనండి! అని లోపలికెళ్లుతూ ఆ చీటిమీదవున్న పేరు చూశాడు గుమాస్తా.

'ఏరువాక భూషయ్య' అని వుంది. ●



## సీరియల్

# తేజోవతి

### జరిగిన కథ

యస్. యస్. యల్. సి. పరీక్షల్లో వేణు కాపీలు పట్టుకుంటాడు శంకరం మేష్టారు శంకరం గారి మంచితనాన్ని గ్రహించిన వేణు అక్కయ్య జ్యోతి వేణుని శంకరంగారి దగ్గరకి ట్యూషనుకు పంపిస్తుంది. జ్యోతి, బావ ఆనందరావును వివాహం చేసికొంటుంది శంకరంగారిమీద లేనిపోని అపోహను ఏర్పరుచుకొన్న వరదరాజులుగారు ఆయనమీద పగ బడతాడు. యస్ యస్. యల్ సి. లిజల్ట్స్ సందర్భంలో పాలుపంచుకోలేకపోయిన వేణు తన యీ స్థితికి కారణమయిన శంకరంగారి మీద పగతీర్చుకుందామని వెళ్ళిన వాడు ఆయన అసలు వుద్దేశాన్ని గ్రహించి గట్టిగా చదివి ప్యాసు కావటానికి కృతనిశ్చయుడవుతాడు. శంకరానికి వరదరాజులు ప్రత్యర్థిగా తయారవుతాడు. రంగడు ఆనందరావు తమ్ముడు అతనికి విద్యాబుద్ధులు గరపాలనే వుద్దేశంతో తనదగ్గరకు రప్పిస్తాడు తమ్ముడ్ని త్రోవలోపెట్టిన శంకరం మాష్టార్ని సత్కరిస్తుంది జ్యోతి మరోసారి ఆతని మంచి తనాన్ని తెలుసుకుంటుంది

## 10

'బావా! వదినమ్మ నీకి కాఫీ యిమ్మంది..'

సన్నని కంఠం వినిపించడంతో 'ఎవరు బాబూ యీ మరదలు' అనుకుంటూ యిటు తిరిగిన వేణు సుశీలనుచూచి ఆశ్చర్య పోయ్యాడు.

జ్యోతి పుట్టింటినుంచి వస్తూ వేణును వెంట తీసుకువచ్చింది. ఎప్పుడూ స్నేహితులతోనూ, మరేదో వ్యాపకంతోనూ కాలం గడిపే వేణుకు యీ పల్లెటూళ్ళో అసలు తోచటంలేదు, మధ్యాహ్నంపూట జ్యోతి దగ్గరకు యిరుగు పొరుగు స్త్రీలంతా వచ్చి కూర్చుంటారు గనుక, హాయిగా అప్పటి దాకా నిద్రపోయిలేచిన వేణు, నవ్వుతున్న మొఖం, మిలమిలా మెరిసే కళ్ళు, మాటల్లో అమాయకత్వం, నిండిన సుశీల తనకు కాఫీ అందిస్తుంటే, ఆ అమ్మాయి ఎవరు, ఏమిటి, తెలుసుకోవాలనే కుతూహలం ఎక్కువైంది వేణుకు

ఈమధ్య జ్యోతికి బొత్తిగా తీరిక వుండటంలేదు. సర్వమ్మగారి ఆరోగ్యం కూడా అంత బాగుండకపోవడంతో యింట్లోపని కూడా చాలామటుకు జ్యోతియే చూచుకుంటోంది. తన దగ్గరకు వస్తున్న మహిళలతో కలిసి 'రేడియో శ్రోతల మహిళా మండలి' ప్రారంభించింది. మొదట వాళ్ళకు జ్యోతితో మాట్లాడ్డానికి జంకుగా వుండేది. వచ్చినా పుల్లవిరిచినట్లు, మొఖాన కొట్టినట్లు మాట్లాడేవాళ్ళు జ్యోతితో. జ్యోతి బాగా చదువుకున్న పిల్లని, అక్షరజ్ఞానమేలేని తమను చూస్తే చులకనగా వుంటుందనే న్యూనతాభావం మారురూపం ధరించి, జ్యోతిమీద వున్నవీ లేనివీ కల్పించి చెప్పుకని తీర్చుకునేవాళ్ళు. జ్యోతికివన్నీ చిరాకుగానే వున్నా కొన్నాళ్ళు ఓపికపట్టక తప్పదని గ్రహించింది. తను చెప్పినవన్నీ అవతల వాళ్ళు వినాలనీ, తన అభిప్రాయాలు వాళ్ళందరూ మన్నించాలి అనుకునే కంటె, ఎదుటివారు చెప్పే విషయాలమీద ఆసక్తి కనబరిచి, వాళ్ళ అభిప్రాయాలను త్రోసివెయ్యకుండా వుంటే స్నేహం వృద్ధికావడానికి మంచి అవకాశం ఏర్పడుతుంది. అలాకాక తమ ఆధిక్యతను ప్రదర్శించుకోడానికి ఎప్పుడు ప్రయత్నిస్తే అప్పుడు అవతల వాళ్ళలోని న్యూనతా భావం అడ్డువచ్చి వాళ్ళమధ్య స్నేహం పొసగనీయదు. జ్యోతి తన ప్రయత్నంలో కొంత సఫలత పొందింది. వాళ్ళకు కుట్లు అల్లికలు వాటితోబాటు, విద్యాకూడా నేర్పుతోంది...

వాళ్ళు వెళ్ళిపోగానె గబగబా దిగి వచ్చి అక్కను అడిగాడు... 'అక్కా! ఆ అమ్మాయి ఎవరక్కా? పెద్ద ముట్టరికం మున్నట్లు వరుస పెట్టి పిలుస్తోంది?...' అని.

'ఎవరు? సుశీలా!... చాలా మంచి పిల్లరా పాపం. కల్లాకపటం లేని అమాయకురాలు. మంచి తెలివి తేటలున్నాయి. బాగా పనీపాటా తెలుసు. మనింట్లో పిల్లల్లే వుంటుంది. అలా అని అక్కడ మాటిక్కడ, యిక్కడ మాటక్కడా చెప్పే రకం కాదు.' అంది జ్యోతి.

'అక్కా!...ఇక్కడ ఏం తోచటం లేదు. విసుగుపుడుతోంది...' అన్నాడు వేణు.

'బాగుందిరా. అలా మేడ మీద కూచుని చుక్కలు లెక్కపెడుతుంటే విసుగు పుట్టదుట్రా. అలా రంగడ్ని తీసుకుని ఏ తోటకో కాలువగట్టుకో పోరాదూ.' అని సలహా యిచ్చింది జ్యోతి.

మర్నాడు ఆదివారం. రంగడికి స్కూలు లేదు. ప్రొద్దున్నే తోటకు ప్రయాణం కట్టారు పిల్లలిద్దరూ. సుశీలక్కూడా వాళ్ళతో వెళ్ళాలనిపించింది.

'బావా...బావా!... నేను కూడా రావద్దా తోటకు?...' అని అడిగింది వేణును

'అదో...అదే వద్దన్నాను నువ్విలా పిల్చేట్లయితే నేనసలు నిన్నెక్కడికీ తీసుకుపోను...' అన్నాడు వేణు వేణుకు బావా అని పిలుస్తే పలకడానికి సిగ్గేసింది

'బాగుంది! వదినమ్మ తమ్ముడు బావేగా .. బావను బావా అని పిలవక యింకేమని పిలుస్తారేమిటి?' ఎదురు ప్రశ్న వేసింది సుశీల.

'ఏం చక్కగా 'వేణూ'అని పిలవరాదూ?'

'ఛీ! పెద్దవాళ్ళను పేరుపెట్టి పిలుస్తారా ఎక్కడన్నా!'

'పిలవకపోతే మానేయ్ నేను నిన్ను తీసుకెళ్ళను.'

'పోన్లే. నీవు తీసుకువెళ్ళపోతే నేను రాలేనా?...నాకు తెలీదనుకున్నావా? రంగడూ మనిద్దరం కలిసి వెళదామురా తోటకు' అంటూ రంగడ్ని తనతో కలుపుకుంది సుశీల.

'బావా! పాపం సుశీలను కూడా తీసుకు వెళ్దాం...' అని రంగడు కూడా రికమండ్ వెయ్యటంతో, యీ పిల్ల వద్దన్నా వచ్చేట్లు

చెప్పి, 'సరే రమ్మను.' అన్నాడు కనికరించి వట్ల!

ఊరికి రెండు మైళ్ళ దూరంలో వుంటుంది ఆనందరావు వాళ్ళతోట. ప్రొద్దుటి పూటతే ఎండలో సరదాగా నడిచారు ముగ్గురూ. తోటలో కొబ్బరిచెట్లు, జామిచెట్లు, సపోటాలు, ఉసిరిక చెట్లూ చాలా వున్నాయి. తోటమాలి బసవయ్య కాపురం కూడా అక్కడే. మిషను ద్వారా తోటకు నీళ్ళుపెట్టడం మొదలైన పనులన్నీ అతడివే. ఆనందరావు ప్రెసిడెంటు అయినప్పటినుండీ అంతగా తోటకు రాలేకపోతున్నాడు. కాయదింపించడం, అవి ఎగుమతి చెయ్యడం వరకే ఆనందరావు పని. మిగతా పనులన్నీ బసవయ్యవే...అయినా అతడు నమ్మకస్తుడు. తన యింటిదగ్గర కూరల పాదులు కూడా పెట్టాడు. ఆనందరావు యింట్లో కూరలు కొనే ప్రమేయం లేకుండా కూరలు పంపిస్తాడు తోటనుంచి.

పిల్లలు ముగ్గురూ తోట చేరుకోగానే బసవయ్య దాహమిప్పించాడు...మజ్జిగనీరు గొంతులో పడగానే పైత్య పెండలో నడిచి వచ్చిన వేణు ప్రాణం తేరుకున్నది. సుశీలా, రంగడూ వాళ్ళకంత అలుపనిపించలేదు. వాళ్ళిద్దరూ పల్లెలో పుట్టారు; ప్రకృతి మధ్య పెరిగారు. ఆ నడకా, ఆ ఎండా వాళ్ళకో లెక్కలోవి కావు...కాస్త సేద తీరగానే యిక తోటలో తిరగడానికి బయల్దేరారు. వాళ్ళతోబాటు బసవయ్యకొడుకు లిద్దరూ కూడా వచ్చారు. పిల్లలకు అన్ని చెట్లమీదకంటె జామిచెట్లమీద అభిమానం ఎక్కువ. చెట్టునిండా కాయ వుంది. ఎలాగో రెండు మూడు రోజుల్లో కాయ దింపించాలనే అనుకుంటున్నాడు ఆనందరావు.

పిల్లలందరూ తలోచెట్టూ ఎక్కారు. దోరకాయలు కోసుకుని, కొమ్మమీద కూచుని, కొరుక్కు తింటూంటే వేణుకు అదో తమాషాగా వుంది. ఎప్పుడో ఐదారేళ్ళ పిల్లాడప్పుడు వచ్చాడు వేణు ఆ వూరికి...సర్దాగా తింటున్న వేణుకు ప్రక్క చెట్టు, చిటారుకొమ్మన చిలకకొట్టిన కాయను కోస్తున్న సుశీల కనిపించింది... ఓయి! కోతీ!...నీకు చెట్లెక్కడం కూడా వచ్చునే!...' అన్నాడు సుశీలకు వినబడాలని పెద్దగానే...

'ఏయ్ బావా!...కోతీ గీతీ అన్నావంటే చూస్కో...' అంటూ సుశీల చేతిలో వున్న కాయను విసిరికొట్టింది వేణుమీదికి.

'కొడితే కొట్టావ్...నాకేం చక్కగా చిలక్కొట్టిన కాయ దొరికింది...' అంటూ చెట్టుమధ్యగా కూర్చుని ఒకకాలు క్రిందకు వేసి తమాషాగా వూపుతూ ఆ కాయను



# "పూర్వాసంధ్యా ప్రవర్తతే..."

కోరికాడు వేణు.

జామిచెట్లు వంతు అయ్యాక వుసిరిక చెట్లు ఎక్కారు పిల్లలు. వేణు కొమ్మ ఎక్కి విదిలిస్తే పిల్లలందరూ కాయలు ఏరారు. అందరలా సరదాగా ఓ చెట్టునీడన కూర్చుని వుసిరికకాయలు తిని మంచి నీళ్ళు తాగారు. అలా తాగితే తమాషా రుచి వస్తుందని చెప్పింది సుశీలే...ఆ తర్వాత బసవయ్య పిల్లలు, రంగడూ, సుశీల దాగుడుమూతలు ఆడుదామంటే ఆడుదామనుకున్నారు. వేణుకు ఆ ఆట ఆడడానికి చిన్నతన మనిపించింది. వచ్చే సంవత్సరం కాలేజీలో చేరబొయ్యే తను ఆసహ్యంగా పిల్లలతో కలిసి దాగుడుమూతలు ఆడడమేమిటి?...అనుకున్న వేణు, 'నే చూస్తుంటాను. మీరాడండి...' అన్నాడు ఓ పెద్ద జామచెట్టు ఎక్కి కూచుని...తీరా వాళ్ళు దూరదూరంగా చెట్లచాటున నక్కి ఆడుకుంటుంటే సుశీలను ఏడిపించాలనే బుద్ధి పుట్టింది వేణుకు. చెట్టుమీదనుండి చూస్తుంటే దూరంగా నక్కివున్న సుశీల కన్పించింది. దొంగపెడుతున్న రంగడికి ఎంత వెతికినా ఎవ్వరూ కన్పించలేదు. వేణు గబగబా చెట్టుదిగి ఈల వేసి రంగడ్ని పిలిచి సుశీల వున్నచోటు సైగచేసి చూపించాడు.

'దొంగ' అయిన సుశీల, 'అమ్మా...నే నొప్పుకోను. బావ చూపించాడు. నేనెందుకు పెడ్తాను?...నేను పెట్టను'. అంటూ పేచీ పెట్టింది.

'బాగుంది. నే నెక్కడ చూపించాను!... నాకేం తెలియదు...' వేణు బుకాయించాడు.

'అయితే ఆటలో లేని వాడివి చెట్టెందుకు దిగాల్సి వచ్చింది?'

'ఆటలో లేనని ఎవరన్నారు?...నేనూ ఆటలో వున్నాను. నువు అవుటయ్యాక నేను దిగొచ్చాను.' అంటూ వేణు తగలా పెట్టుకున్నాడు.

'అన్యాయం...బావదంతా అన్యాయం.' అంది సుశీల ఏడుపు మొహంపెట్టి మిగతా ముగ్గురూ కూడా సుశీల దొంగ పెట్టాలి తప్పదనేసరికి. 'అయితే—బావా!...నువ్వా ఆటలో వున్నట్టేగా...' అని అడిగింది.

'ఆహా...'

'అయితే చూస్కో బావా!...నిన్నేదొంగను చెయ్యకపోతే...' అని పంతం పట్టింది, సుశీల.

'అబ్బో!...చేస్తావుగా చూస్తాను!...' వేణు సవాలు చేశాడు.

వేణు సుశీలకు చిక్కకుండా ఎక్కడెక్కడో దాగాడు. అయినా పంతంబట్టిన సుశీల, అలుపొచ్చినా, ఆయాసం వచ్చినా, మిగతావాళ్ళను పట్టించుకోకుండా వేణు కోసమే వెతికి వెతికి చివర కెలాగో కనుక్కుంది. తీరా తను 'దొంగ' పెట్టాల్సి వచ్చేసరికి, 'అబ్బ...చాలా ప్రొద్దెక్కింది. ఆకలేస్తోంది. ఇక నేనాడలేను. ఇంటికి వెళ్దాం...' మన్నాడు వేణు.

'కొంచెం సేపయినా దొంగపెట్టందే ఆట ఆపడానికి వీల్లే'దని సుశీల వాదించింది. కానీ పిల్లలందరూ అప్పటికే బాగా అలిసి వుండడంతో సుశీలమాటను ఎవ్వరూ సమర్థించలేదు. విధిగ యింటి ముఖం పట్టాల్సి వచ్చింది సుశీల. ఎర్రటి ఎండలో కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా నడుస్తున్న సుశీలను చూస్తే వేణుకు ఆశ్చర్యం కలిగింది...'ఏయ్ మొద్దూ!...చెప్పులు కూడా వేసుకోకుండా వచ్చావ్...కాళ్ళు కాలటంలా?!' అని వేణు అడిగినదానికి 'ఓష్!.. కార్తీకమాసం ఎండ యిదో ఎండా !...' వింతగా చూసింది సుశీల.

ఇంటికి వస్తూనే కుర్చీలో కూలబడిపొయ్యాడు వేణు. మొహం ఎర్రబడింది. ఒళ్ళంతా చెమటలు కారుతున్నాయి. ఆయాస పడుతున్న వేణును చూడగానే సుశీలకు నవ్వొచ్చింది. 'ఓయి యీ మాత్రానికే వగరుస్తున్నావేమిటి బావా!...నేనుచూడు...' అంటూ ఎగతాళి చేసింది సుశీల.

'నువ్వయితే పల్లెటూరి మొద్దువి...'

'ఓహో బస్తీ బావగారి వస తెలిసిందిగ?...' అప్పుడే ఏడుపు మొహంపెట్టేసింది సుశీల.

'ఏయ్ కోతి!...ఆపవోయ్ పెద్ద...'

'చూడు వదినమ్మా బావ...ఎగతాళి చేస్తున్నాడు...' అంటూ సుశీల వెళ్ళి జ్యోతితో ఫిర్యాదు చేసింది.

'మరి బావంటే ఎగతాళి చెయ్యడా?...' అంది నవ్వుతూ హాల్లోకి వచ్చిన జ్యోతి.

'ఏమిట్రా వేణూ!... సుశీలను ఏడిపిస్తున్నావుట?...' అడిగింది.

'కాదక్కా నువు చెప్పు... చెట్లెక్కేది కోతులవునా కాదా?...'

'ఛా!...సుశీలేం కోతికాదు. చక్కగా బంగారు బొమ్మలా వుంది...' అని సుశీలను బుజ్జగించింది.

'వదినా! బావసలు నడవలేక పొయ్యాడు.' అన్నాడు రంగడు.

'వాడేం నడుస్తాడు?... సైకిలెక్కి సికార్లు కొట్టమంటే కొడతాడుగానీ ... పట్టుమని పర్లాంగు దూరం నడిచే అలవాటేదీ?...' అంది జ్యోతి.

'ఎండకు ఆయాసం వచ్చిందిగానీ యీ మాటుమాడు ఎన్నిమైళ్ళు నడవమంటే అన్నిమైళ్ళు నడుస్తాను. ఎంతెంత



పందెం?...' అని రంగడిని సవాలు చేశాడు వేణు.

'ఇంతకూ తోట ఎలావుందిరా వేణూ?...' జ్యోతి టాపిక్ మార్చింది.

'తోట చాలా బాగుంది కానీ...అక్కా!.. సర్దాగా, అక్కడ ఆ చెట్లక్రింద, ఓ రోజు పిక్‌నిక్‌లా గడుపుదామక్కా...'

'వదినమ్మా!...కార్తీక మాసంలో ఎట్లాగూ వన భోజనాలు చెయ్యాలిగా ... ఓ రోజు అందరం కలిసి వెళ్దాము వదినమ్మా...' అని జ్ఞాపకం చేసింది సుశీల.

'సరేలే...మీ బావతో చెప్పి ఏర్పాట్లు చేయిస్తాలే గానీ...ఇక భోజనానికి పదండి...' అని జ్యోతి హెచ్చరించడతో సుశీల వాళ్లింటికి వెళ్లిపోయింది.

'దగ్గరేనా అక్కా పిల్లల్లు?' అని అడిగాడు వేణు సుశీల వెళ్ళాక.

'మన పక్కయిల్లేరా వాళ్ళది. తను వాళ్ళ పిన్ని దగ్గర వుంటోంది. వాళ్ళనాన్న గారుండేది గుంటూరులోనట ... ఆయన పేరు కూడా ఏదో తమాషా పేరు చెప్పింది...' అని జ్యోతి ఆయనపేరు జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తుంటే, 'పోనిస్తూ ఎవడో గణపాయ్!... మా కన్నం పెట్టు ముందు...' అంటూ లేచాడు వేణు.

అన్న ప్రకారమే జ్యోతి రెండు మూడు రోజుల్లో తోటలో సమారాధన ఏర్పాటు చేసింది. భోజనాలయ్యాక పిల్లలందరూ కలిసి కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు... ఆ కబురూ యీ కబురూ చెప్పుకుంటూ...' ఇటువైపు వెళితే ఎటెళ్ళచ్చు? అటుపోతే ఎక్కడికి పోతాం?' అని అడుగుతున్నాడు వేణు. సమారాధనలో తన యీడు కుర్రాళ్ళు పది పదిహేను మందితో పరిచయమైంది వేణుకు. వాళ్ళు ఏ దోవన వెళితే ఎక్కడకు చేరుతారో వివరంగా చెబుతున్నారు... 'ఇటు కుడిచేతి వైపు వెళితే ఎటెళుతాం?' అనడిగాడు వేణు... 'ఇటూ?...ఇటు వెళితే దయ్యాల మర్రిదగ్గరకు పోతాం...' అని చెప్పాడు సీను. సీను రవణయ్యగారి రెండో కొడుకు.

'దెయ్యాల మర్రి!...అంటే?...' వేణు తెల్లబోతూ ప్రశ్నించాడు...

'అంటే ఆ చెట్టు మీద దయ్యాలుంటాయని ప్రతీతి. సాయంత్రం ఆరయిందంటే అటుకేసి ఎవ్వరూ వెళ్లరు...' అని చెప్పాడు యింకో అతడు.

'అంతా వుత్తది...దయ్యాలాగియ్యాలా? వెళితే ఏం చేస్తాయట?...'

ఇలాంటి వాటిని నమ్మడం వేణుకు అవమానంగా తోచింది.

'ఏం చేస్తాయా?...ఒకమాటు వెళితే తెలుస్తుంది...'అన్నాడు మరో అతడు...

'మిమ్మల్ని ఎప్పుడైనా ఏమన్నా చేశాయ్యా.' సూటిగా ప్రశ్నించాడు వేణు.

'మేమసలటు వెళితేగా?...చాలామంది చెప్పారు.' అన్నాడు సీను తన అభిప్రాయాన్ని బలపర్చుకుంటూ.

'అయితే ఆ దయ్యాలను చూసిన వాళ్ళెవరో, వాళ్ళను అవేం చేశాయో చెప్పండి... వాళ్ళను వెళ్ళికనుక్కుంటాను.' అన్నాడు వేణు మొండిగా...

'అటు అసలెవరెళుతారు? ఎవరు చూస్తారు?... పెద్దవాళ్లు చెబుతారుగానీ...' అన్నాడు విసుగ్గా యింకొకడు...

'ఎవరో ఏదో అన్నారంటే ఒప్పుకోను... అంతా వుత్తది...దయ్యాల్లేవు గియ్యాల్లేవు' అన్నాడు వేణు. ఇంకా, 'ఉంటే చూపించండి...అప్పుడు నమ్ముతాను.' అన్నాడు.

'అట్లయితే—అమావాస్యనాటి అర్ధరాత్రిరా...నీకు చూపిస్తాం' అన్నాడు సీను అప్పటికైనా వేణు నమ్ముతాడనే ఆశతో...

'ఓ యస్!...చూపించక పోతే ఎంత పందెం?...'

'మీరు దయ్యాల్ని చూపించకపోతే మీరందరూ యికముందు నేను చెప్పినట్లు వినడుచుకోవాలి. మీరు చూపిస్తే నేను మీరు చెప్పినట్లు వింటాను...సరేనా' అని పందెం కాచాడు వేణు.

'బడాయి కొట్టాడుగానీ, అతడికి మాత్రం దయ్యాలంటే భయంలేదా? ఎందుకొస్తాడులే' అనుకున్నారు సీనూ వాళ్ళు...కళ్ళతో చూడందే, అనుభవంలోకి రాందే—దేన్నీ నమ్మని తత్వం వేణుది... అసలా 'ఏడాలిసెంట్ పీరియడే' అటువంటిది. ఎవరో ఏదో చెప్పారు నమ్మమంటే



# "హార్యాసంధ్యా ప్రవర్తతే..."

నమ్మలేని వయసు. పెద్దలు చెప్పింది నిజమేనని వాళ్లకు తోచాలి లేదా అనుభవంలోకి రావాలి...అనుకున్న ప్రకారం అమావాస్య నాటి అర్ధరాత్రి సమయానికి వాళ్ళు ఏర్పాటుచేసుకున్న స్థలానికి అందరికంటె ముందువచ్చి చేరాడు వేణు. వేణు అసలు రాడని నిర్ణయించుకున్న సీనూ వాళ్ళు అతడ్నిచూసి ఆశ్చర్యపోయ్యారు. కానీ అనుకున్నప్రకారం యువకులందరూ రావడానికి వీల్లేకపోయింది. ఇంట్లో పెద్దవాళ్ళకు తెలియకుండా అర్ధరాత్రి యిల్లుదాటిరాగల అవకాశంలేని వాళ్ళు నలుగురైదుగురు యింట్లోనే వుండి పోవల్సివచ్చింది. మొత్తం ఓపదిమంది కుర్రాళ్లు పోగయ్యారు. లాంతరు ఒకడు, ఒక దుడ్డు కర్ర ఒకళ్లు పట్టుకొచ్చారు...అంతా హుషారుగా బయలుదేరారు...వేణు నోరు మూయించాలనే సంకల్పంతో సీనూవాళ్లు, వాళ్ల నోరు కట్టెయ్యాలని వేణు...

అంతా ఓ మైలుదూరం నడిచారు... దెయ్యాల మర్రి చేరుకోవాలంటే యింకా ఓ మైలు మైలున్నర నడవాలి...అసలే అమావాస్య అర్ధరాత్రి, దానికి తోడు నక్షత్రాల కాంతికి కూడా మబ్బులు మూసేసి కటిక చీకటిగా వుంది. ఆ చీకట్లో చిన్నాపెద్దా ప్రతిచెట్టూ తల విరియబోసుకుని వికృతంగా నవ్వుతున్నట్లు కనిపిస్తున్నయి...చుట్టూ భయంకరమైన నిశ్శబ్దం...డొంక దోవకు రెండు వైపులా పొలాలు...భయోత్పాదకంగా వుంది వాతావరణమంతా...

'వేణూ!...ఏమంటావ్ వెళదామా?...' అనడిగాడు సీను, యిప్పటికైనా నమ్మకం కుదరదా అనుకొని.

'ఇంకా ఎంత దూరముంది?' అని అడిగాడు వేణు.

'ఇప్పుడు మనం వచ్చినంత దూరం వుండచ్చు'

'అయితే తొందరగా నడుద్దాం పట్టండి.' అన్నాడు వేణు...అందరూ యింకొంచెం దూరం నడిచారు...రెండు వైపులా ఏపుగా ఎదిగి కోతకు సిద్ధంగా వున్నపొలాలు... పంటపొలాలకు కాపలావున్న వాళ్లు గూడా, మెత్తగా గడ్డి పర్చుకుని, వెచ్చగా కునుకు తీస్తున్నారు. మరో అరమైలు అలాగే నడిచేసరికి పొలాలు దాటి తాటితోపుల్లోకి వచ్చారు...

తాటితోపులదగ్గర భయం వేసింది పిల్లలకు, ఆ తోపు దాటితే కొద్దిదూరంలోనే వుంటుంది మర్రిచెట్టు. కానీ అక్కడినుండి సీనూ వాళ్లకు అడుగు ముందుకు పడలేదు. ఇక ముందుకు రామన్నారు వాళ్లు... 'కావాలంటే నువ్వొక్కడివీ వెళ్లి చూసిరా... నీకేగా నమ్మకం లేంది?' అన్నారు...

'ఛీ! యింత పిరికితనమా?...' అంటూ గేలిచేశాడు వేణు.

'బాగుంది... దెయ్యాలు లేవని వాదిస్తున్న వాడివి నువ్వు. ధైర్యం వుండాల్సింది నీకుగానీ మా కెందుకుంటుంది.?' అని ఎదురు ప్రశ్నవేశారు వాళ్లు.

'నిజంగా దెయ్యాలుంటే మీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డు. నేను ఒక్కడిని వెళ్లి అక్కడ నిజంగా వున్నా లేదని చెబితే మీకు నమ్మకం ఏమిటి? అందులో మన పందాలకంటె అసలు దయ్యాలున్నయ్యా లేవా అనేది మనందరం తెల్సుకోవల్సిందే గదా...వాళ్ళెవరో దయ్యాలున్నయ్యంటే మనమూ గంగిరెద్దుల్లే అవుననడం ఏమిటి?...రండి అందరంవెళ్ళి చూసొద్దాం.' అంటూ అందర్నీ ప్రోత్సాహపరిచి నడక సాగించాడు వేణు. సీనూ వాళ్ళుకూడా మౌనంగా అతడి వెనకాల నడవడం 'మొదలెట్టారు. అందరూ యించుమించు పదహారునుండి పద్ధెనిమిది సంవత్సరాలలోపు వయసుపిల్లలు...వేణు యింత నిర్భయంగా చెబుతుంటే వాళ్ళు చెబుతున్నది నిజమవునో కాదో తెల్సుకోవాలనే కుతూహలం వాళ్ళకూ కలిగింది. అసలు మానవుడే నిత్యసత్యాన్వేషి. మొదట ప్రకృతి శక్తులను, దానివిజృంభణను చూసి భయపడ్తాడు... వాటికి దేవుడనో, దయ్యమనో నామకరణం చేసుకుంటాడు... అటుపైన ఆ భయాన్ని చూసి భక్తితో పూజించడమో, లేక భయంతో పారిపోవడమో చేస్తుంటాడు. కొన్నాళ్ళకు ఎవరికో సందేహం వస్తుంది. 'తమ భయంలో ఎంత సత్యముందని?... ఇక ఆ సత్యం తెలుసుకోవాలని బయలుదేరుతాడు...మళ్ళీ భయం అడ్డమెస్తుంది... అయినా కుతూహలం దాన్ని జయించి మానవుణ్ని ముందడుగు వేయిస్తుంది. మానవుడు సాగించే యీ నిత్యసత్యాన్వేషణ ఫలితమే యీనాటి యీ ప్రగతి. ఈ కన్పించే ఆకాశపు టంచుల కవతల ఏముంది? ఆహోరాత్రాలూ ఘోషించే అగాధ జలనిధి గర్భంలో వుండేవేమిటి? సుదూర ధృవ ప్రాంతాల స్థితిగతులెలా వుంటయి?... ఉన్నతోన్నతమైన హిమగిరి శృంగాలమీద మనుష్యులు మనగలరా?... మానవుని మనస్సులో ప్రభవించిన యీ ఆరని అగ్ని, తీరని తృష్ణ, రోదసీ రహస్యాలను బట్ట



జయలు చేయాలని, చంద్రమండలంలో కాలు పెట్టాలని ప్రయత్నించే దాకా తీసుకు వచ్చింది!...

తాటి తోపు దాటేసరికి, చిక్కటి చీకటిలో తల విరబోసుకుని వికటాట్టహాసం చేస్తున్నట్లు ఓ ఫర్లాంగు దూరంలో మర్రి చెట్టు కన్పించింది... ఊడలు దిగిన మర్రిచెట్టును చూస్తూంటే నిజంగానే దయ్యాలు సభ జరుపుకుంటున్నట్లుగా అనిపించింది. ముందు నడుస్తున్న వేణుకు... కాళ్లు వణకడం ప్రారంభించాయి. తనకు తెలియకుండానే తను గడ్డకట్టుకు పోతున్నట్లుగా వుంది... 'నిజంగానే దెయ్యాలున్నాయ్యేమో ననుకునే' సరికి వేణు చెవులకు 'ఊహి... ఊహి...హి...' మన్నట్లు, తన్ను చూసి రమ్మంటున్నట్లు అనిపించింది... తన వెనకాలే దయ్యం వస్తున్నట్లు అనిపించి వులిక్కిపడి తిరిగి చూశాడు...సీనూ వాళ్లు వెనకాలే నిలబడి వున్నారు... 'ఆ చెట్టేనని' చూపిస్తూ ... వేణుకు ముందడుగు వెయ్యడానికి దమ్ము చాల్లేదు... లాంతరు పైకెత్తి పట్టి చుట్టూ చూశాడు...ఆ వెలుగులో సీనూ వాళ్ల మొఖాలు చూశాడు...వాళ్లు తన భయాన్ని పసిగట్టేసినట్లు, నవ్వుతున్నట్లు అనిపించింది.

వేణు కొక్కసారిగా మొండి తెగింపు వచ్చేసింది. తను వెను దిరిగితే వీళ్లందరూ అపహాస్యం చేస్తారు...కోతలు కోశావని, బీరాలు పలికావని ఎగతాళి చేస్తారు ... వాళ్లందరి చేత పిరికి పందనిపించుకునే కంటె 'చూద్దాం ఏం చేస్తాయో?...' అనే మొండిధైర్యం వచ్చింది ... లాంతరు వత్తి కొంచెం పెద్దదిచేసి, ఒక చేతిలో కర్ర పట్టుకుని పెద్ద పెద్ద అంగలేసుకుంటూ ముందుకు నడిచాడు ... అతడి వాలకం చూస్తుంటే దేనివిహాదో యుద్ధం ప్రకటించి, ముందుకురుకుతున్నట్లు వుంది... వేణు అంత ధైర్యంతో ముందుకు సాగే సరికి సీనూ వాళ్లకు కూడా తమ భయం మీద అసహ్యం వేసింది...వాళ్లూ ధైర్యం తెచ్చుకున్నారు ... ఏమయితే అయిందని వాళ్లూ అతడితోబాటు నడవసాగారు...

ఐదు నిముషాల్లో మర్రి చెట్టు దగ్గరికి రానే వచ్చారు. మైదాన ప్రదేశమేమో... గాలి రివ్వున వీస్తోంది... ఆ గాలికి ఆకులు

# పూర్వా సంధ్యా ప్రవర్తతే..

వింత వింత శబ్దాలు చేస్తున్నాయి.. లాంతరు ఎత్తిపెట్టి చుట్టూ చూస్తున్నాడు వేణు... పై నుండి ఏదో 'ధబ్బు' మని పడ్డట్లయింది...

అందరి గుండెలూ ఒక్కసారి ఆగి మళ్ళీ కొట్టుకోడం మొదలెట్టాయి. పరుగెత్తడానిక్కూడా కాళ్ళు ఆడలేదు...బొమ్మలా నిలబడ్డారు అందరూ, వూపిరి కూడా బిగపట్టి...తర్వాత వేణూ లాంతరు అటు తిప్పిచూశాడు ... ఏమీ లేదు!... కాకిగూడు పడివుంది ఆకుల మధ్య.. వేణుకు అప్పటికి ధైర్యం వచ్చింది...కర్రతో ఆకులు పక్కకు తోస్తూ లాంతరు పట్టుకుని చెట్టు క్రిందికి వెళ్ళాడు...తలెత్తి చెట్లకొమ్మల్లోకి, వూడలవైపు చూస్తూ. సీనూ వాళ్ళూ కూడా వెళ్ళారు ... చుట్టూ చూస్తున్నారు అంతా...ఉన్నట్టుండి ఒకడన్నాడు... 'ఒరేయ్! అదేమిట్రా?...' అని... అదీ చాలా మెల్లిగా, చెవులో చెప్పినంత మెల్లిగా...ఒక్కసారిగా పదిజతల కళ్ళూ అటు తిరిగేయి ... నల్లటి ఆకుల్లోంచి ఎర్రగా మెరుస్తున్నాయి...క్షణంలో వేణు చెయ్యిపట్టు తప్పి లాంతరు క్రింద పడార్యింది!...

రెండోచేత్తో దాన్నిసరిగా పట్టుకుని లాంతరు పైకెత్తాడు వేణు...ఆ వెలుగులో అవి రెండూ రెండు కళ్ళలా కనిపించాయి .. వెంటనే చేతిలో వున్న కర్రతో కొమ్మను కొట్టాడు...ఆకులు చప్పుడు చేసుకుంటూ తుర్రున పారిపోయిన శబ్దం... 'గుడ్లగూబరా...' అన్నాడు సీను...

అప్పటికి వాళ్ళ ప్రాణాలు కుదుటబడ్డాయి... అందరూ కలిసి చెట్టుక్రింద నాలుగు వైపులా తిరిగి వచ్చారు... 'ఇక వెళ్దామా?' అన్నాడు వేణు.

'ఊఁ...' అన్నారు అంతా ... అంతే.




అందరూ తిరుగు ముఖం పట్టారు...

'ఏవి దెయ్యాలన్నారు? చూపించమని వేణు అడగలేదు. 'అయ్యో!...దెయ్యాలు టాయన్నారు? ఏవి?...' అని వాళ్ళూ అనలేదు...అంతా మౌనంగా బయలుదేరారు... ఒక్కళ్ళూ నోరు మెదపకుండా, త్వర త్వరగా అడుగులేసుకుంటూ తాటి తోపు దాటి, చేలగట్లంబడి వూరు పొలిమేరలు చేరుకున్నారు...అప్పుడన్నాడు వేణు. 'అక్కడేనీ వున్నట్టులేవు గదూ?...' అని. అదీ చాలా మెల్లగా అన్నాడు.

'ఏదీ? ... ఏవీ కన్పించలేదుగా?...' అన్నాడు సీను ఓటమి ఒప్పుకున్నట్లు...

అలా ఓడిపోయినట్లు ఒప్పుకోడానికి పూర్తిగా యిష్టపడని యింకోడు, 'ఆ... యింతమందిమి కలిసి, దీపం, కర్రాగిర్రా పట్టుకుని వెళితే దయ్యాలు కాచుక్కూచుంటయ్యా మనకోసం?...' అన్నాడు...

ఆపైన యింకెవరు మాట్లాడలేదు. అంతా ఎవరి దోవన వాళ్ళు యిళ్ళకు వెళ్ళిపోయ్యారు.

మర్నాడు, అర్ధరాత్రి దాకా నిద్రలేనందువల్ల బాగా ఎండ ఎక్కాకగానీ లేవలేదు వేణు. పళ్ళుతోముకుంటుండగా సుశీల వచ్చింది....వస్తూనే 'బావేడీ?' అంటూ దొడ్లోకి పరుగెత్తుకొచ్చి వేణును చూడగానే...

'బావా...మీరంతా దయ్యాల మర్రి దగ్గరకు వెళ్ళొచ్చారటగా రాత్రి! ... మిమ్మల్నేం చెయ్యలేదుటగా దెయ్యాలు!!... బావా!... నీ కెంత ధైర్యం బావా!...' అంది. మిలమిలలాడే సుశీల కళ్ళల్లో ఆనందంతో కూడిన ఆశ్చర్యం, అభిమానంతో కూడిన మెప్పు కన్పించాయి. ఆ క్షణంలో వేణుకు తన మీద తనకు అపరిమితమైన నమ్మకం, సుశీల మీద తెలియని అభిమానం కలిగి హీరోలా పోజుపెట్టి, 'మరి వేణు అంటే ఏమనుకున్నావ్?... అసలీ సంగతి ఎవరు చెప్పారు నీకు?...' అని అడిగాడు...

'ఊళ్ళో అందరూ అనుకుంటుంటే తెలిసింది ..' అన్నది సుశీల

అయితే ఆ తర్వాత చాటుగా పిల్చి జ్యోతి మందలించింది. 'అటువంటివన్నీ చెయ్యకు యింకముందు ... వాళ్ళందరికీ, నీమీద కొంతుదాకావుంది...ఇందాక ఒకావిడ

న్నపోన్నె అంది కూడాను....'ఎక్కడి పిల్లా డమ్మా!...మావాళ్ళందర్నీ, అర్ధరాత్రి, అప రాత్రి చెట్టుకిందా పుట్టకిందా తిప్పు తున్నాడు...ఏమన్నా అయితే ఎవరు దిక్కు.' అని...'

కానీ సినీమా వాళ్ళుమాత్రం వేణును గురువుగా భావించారు...'వేణు చెప్పిన దాంట్లో విశం లేకపోలేదు...!' అని చాలాసార్లు అనుకున్నారు. వేణు కూడా యిక ఆ విషయం ఎత్తకుండా యితర విష యాలు మాట్లాడేవాడు. తీరిక చిక్కగానే సినీమా వాళ్ళందరూ వేణుచుట్టూ మూగియ్యేవాళ్ళు...ఒకసారి మాటల్లో నాట కాల ప్రసక్తి వచ్చింది... వేణు తనకు నాటకం వెయ్యాలని వుందని అన్నాడు...అయితే అందరం కలిసి నాటకం వేద్దామని నిశ్చ యించారు పిన్నలంతా...ఆనందరావుక్కూడా నాటకాల పిచ్చివుండడంతో అతడు రంగు పూసుకు స్టేజి ఎక్కాలనివున్న మరికొంత మందిని పోగుచేసి రిహార్సల్సు ప్రారంభిం చాడు. అంటే ఆనందరావు దర్శకత్వం క్రింద నాటకం రిహార్సల్సు జరుగుతున్నాయి. నాటక ప్రదర్శన యిక నాలుగురోజు లుండనగా వేణు పేపర్లో 'రేపు స్కూలు ఫైనలు రిజల్ట్సు ప్రచురిస్తా'మన్న వార్త చూశాడు. ఒక్కపరుగున అక్కదగ్గరకు వెళ్ళి 'నేను గుంటూరు వెళ్ళిపోతా' నన్నాడు.

'రేపుదయం పేపర్లో...కదరా...ఆ పేపరు యిక్కడికీ వస్తుందిగా? .... దానికోసం గుంటూరు వెళ్ళట మెందుకు?' అని అడిగింది జ్యోతి.

'కాదులే అక్కా! ... గుంటూరుకు యివ్వాళ సాయంత్రమే వస్తుంది' ఈ వినింగ్ ఎడిషన్! అదీకాక, అమ్మకు, మేష్టారికి చెప్పొద్దా?...మా ఫ్రెండ్స్ దేమ యిందీ కనుక్కోవద్దా?...' అన్నాడు వేణు.

'నాలుగురోజుల్లో నాటకం పెట్టుకుని ఎక్కడకు వెళతావు?' అని లేచారు మిత్రు లంతా...

'రాత్రికి పేపరు చూచుకుని, రేప్పొ ద్దున ఫస్టుబస్సులో తిరిగొచ్చేయనా మా అక్కదగ్గరకు...' అని వాళ్ళకు హామీ యిచ్చి బయలుదేరాడు వేణు.

(ఇంకా వుంది)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1967 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరంకూడా "ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి కథలపోటీ" నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతో షిస్తున్నాము, రచయితలందరూ ఎప్పటివలే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

**మొదటి బహుమతి రు. 1600**

**రెండవ బహుమతి రు. 900**

**మూడవ బహుమతి రు. 500**

### నిబంధనలు

1. కథలు స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని, దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితం మీద కాక కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒక వైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచన 12 ఠావు (ఎక్సర్సైజు నోట్‌బుక్ పేజికి రెండు రెట్లు) పేజీలకు మించరాదు.

4. కవరు మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1' కి పంపాలి.

5. పోటీకి గడువు తేదీ 31—8—67. ఆ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 3—11—1967 తేదీకల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుదినిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటు వంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు.

8. వ్రాత ప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యంకాదు. పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలాబిళ్ళలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.



గంటి వెంకటరమణ

అనురసంధ్య ప్రపంచాన్ని పులుముకుంది. మంచం మీద పడుకున్న రాధిక మనసు నిండా భయం నిండిపోయి వేయి వాలుకలతో విజృంభిస్తూ అసలే రోగంతో, బాధతో కొట్టుకుపోతున్న మనిషిని యింకా యింకా అగాధంలోకి లాక్కుపోతోంది. సుమారు నలభై సంవత్సరాలు నిండిపోయిన రాధిక శరీరం కన్నా మనసు వార్ధక్యాన్ని కౌగలించుకుంది.

చాలీ చాలని జీతంతో మధ్య తరగతి కుటుంబంలో ఓ మాదిరి సాంఘిక కట్టుబాట్ల మధ్య పెరిగారు రాధికా, యమునా. అన్న గోవిందు ఆలంబనతో యౌవ్వనంలో అడుగుపెట్టారు.

ఆకాశంలో రంగులు క్షణక్షణానికి మారుతున్నాయి. రాధిక మనసు గతాన్ని త్రవ్వుకుంటూ పాతిక సంవత్సరాల వెనక్కు వెళ్ళి ఆగిపోయింది.

'ఏయ్ రాధా ఈ చీర నీకు. యిది యమునకి, యిది మీ వదినకి' గోవిందు చీరెల పాకెట్ విప్పి బల్లమీద పెట్టాడు.

సరస్వతి నవ్వింది. 'నాకు వత్తి నేత చీరలూ మీ చెల్లెళ్ళకి సన్నవీ,వాయిల్‌వీనా,' అంటూ.

అందుకు యమునే సమాధానం యిచ్చింది... 'అన్నయ్య అలాగే అంటాడు వదినా. మీరు తీసుకున్నాకనే మేము తీసుకుంటాం. ముందు మీరే ఎన్నుకోండి. కాదంటే అప్పుడే అన్నయ్యని మమల్ని అందురుగాని'

ఆడపడుచుల మధ్యగా కూర్చుని భర్త వైపు చూసింది సరస్వతి: 'తెలివి తేటలకి వాకళ్ళకి మించి మరొకళ్ళు మీ అన్నా చెల్లెళ్ళు. మీ కోసమే అని ప్రత్యేకం ఆయన తెస్తే నేనెలాగూ తీసుకోనని తెలుసు నీకు. మాటేకదా అని అనేశావు'

'తీసుకుందుకి వదినకి దమ్ముల్లేవక్కా. అందుకే నింద మనమీద వేస్తోంది. నా వాయిల్ చీర మీరే తీసుకోండి వదినా. నేను కాదంటే అప్పుడు చూసుకుందురుగాని,' రాధిక చీర మడత విప్పి వదినగారి భుజం చుట్టూ వేసింది.

సరస్వతి చీరెను సున్నితంగా తీసి బల్లమీద పెట్టేసింది. 'తమాషా చేశానంతే. ఈ వయసులో ఆ చీరెలు కట్టుకుంటే బజార్లో వెళ్ళేవారంతా నిలబడిపోయి నన్నే చూస్తారు.'

'పోన్లే సరూ మంచి గిరాకే టిక్కెట్టు పెడితే. వోసారి కట్టుకోవోయ్ నాకూ చూడాలని వుంది,' గోవిందు భార్యని వేళాకోళం పట్టించాడు.

అది గమనించి సరస్వతి మాట్లాడకుండా కళ్ళతో ప్రేమని కురిపిస్తూ, ఆడబిడ్డల్నీ, భర్తనీ చూడసాగింది.

* * *

'పిల్లడు అచ్చు మీ పోలికే వదినా. ఆ నోరు కొంచెం చిన్నది పెట్టివుంటే మరీ బాగుండిపోను. ప్చ్! యేం లాభం? ఆ వదిన కొడుకని నలుగురికు ప్టాంపు వేసినట్లు తెలిసిపోతుంది,' యమున వుయ్యాల్లోంచి పాపను తీసి యెత్తుకుని ముద్దులు కురిపిస్తూండి పోయింది.

అక్క చేతిలో వున్న పాప కుడిచేతికి అందుకుని ఆ వేలుకి వొంటిరాయి వుంగరం, మురుగులు పెట్టి చెంపలమీద ముద్దు పెట్టుకుంటున్న రాధికను గోవిందు మార్చి మార్చి చూశాడు. 'యిప్పుడెందుకు యివి. మీకేం పిచ్చా. ఆ డబ్బు వుంటే ముగ్గురికీ మంచి చీరలు రాకపోయేవా,' మెల్లగా మందలించాడు చెల్లెళ్ళని.

యమున అంది. 'యింటికి నువ్వు పెద్దవాడివి. నాన్నగారు వుంటే అలాగే చేసేవారు. కానీ మనకు అదృష్టం లేదన్నయ్యా. పోయిందేమీ లేదు. చేతిలో వున్న సరస్వతీ దేవి దయవల్ల యీపాటి చేయగల్గేం అనే తృప్తి మాకు వుంది.'

'మిమ్మల్ని హద్దులో వుంచక పోవడం నాదే పొరబాటు. విచ్చలవిడిగా ఖర్చు పెట్టేస్తే రేపు పెళ్ళి పేరంటం సంగతి ఆలోచించాలా, వొద్దా,' సరస్వతి మనస్ఫూర్తిగానే అంది.

* * *

'యమునకి పెళ్ళిచేయాలి. మీరేవీ పట్టించుకోక పోతే యేలా చెప్పండి. నలుగురూ అడిగే ప్రశ్నలకి జవాబు యివ్వలేక పోతున్నాను. నా మెడలో వున్నది అమ్మేస్తే ఓ యెనిమిది వందలు రాకపోవు,' భర్త మంచం మీద వో చివర కూర్చుంటూ అంది సరస్వతి. యెనిమిదివందలకి తగిన సంబంధం రాకపోదు అనే వుద్దేశ్యంతో.

గోవిందు మొహంలో కిరసనాయిల్ దీపపు కాంతులు పడి భార్యకి ఆ మొహంలో వున్న భావాలు స్పష్టంగా కనిపించి పోతున్నాయి.

'వివరంగా మాడకండి. ఆ చూపులకి నేను అడిగే ప్రశ్నలూ, వాటికి వొచ్చే సమాధానాలూ. అడుగునే పడిపోతున్నాయి. నన్నేం చేయమంటారు? ఈడేరిన పిల్లల్ని యిద్దర్నీ యింట్లో వుంచుకుని మీతో నేను దాసక్రీడలు సలుపుతూంటే మగవాడి ల్లాగా గ్రహించడు. ఆడది దానికేమైంది అంటున్నారు.'

'నిజం ఆలోచిస్తే నలుగురూ అన్నారని జీవిక? వాకే బాగులేదు. ఈ చేతుల్తో పిల్లల కన్నా ఎక్కువగా పెంచి పెద్దచేశాను. మన మీద యింకా కొద్ది బాధ్యత రోజు రోజుకీ పాపం పెరిగినట్లు పెరిగిపోతుంది. మీరు యిలా యెంతకాలం ముక్కుమూసు కూర్చుంటారో అర్థం కావడంలేదు,' సరస్వతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. భర్త గుండెల మీద తల అన్చి మెల్లగా యేడుస్తూండి పోయింది.

'హద్దులే. ఏడవకు సరూ. నీకు తెలీదూ నా సంగతి,' ఒక్కొక్క మాటే మెల్లగా కూడబలుక్కుంటూ అన్నాడు.

'మీ సంగతి తెలియాల్సినది నాకుకాదు. ప్రపంచానికి. గోవిందు భార్య మెడనిండా నగలున్నాయి, పెట్టెనిండా చీరలున్నాయనే తెలుసును యీ ప్రపంచానికి. కానీ ఆ గోవిందుకి వచ్చే సంపాదనా, సంసారం గురించి తెలీదు. ఈ నేసవిలో యమునను సాగనంపి తేశా గాని నేను నీరు ముట్టేదిలేదు,' సరస్వతి సంఘం మధ్య అడకత్తెరలో పోకలా నలిగి నలిగి బేజారైపోయింది.

* * *

వదినకి,

యమున నమస్కరించి వ్రాయుడం. జీవితం నిస్సారంగా వుండడం నాకు యెంత మాత్రం యిష్టం లేదు. ఒకే రకం చీర కట్టుకుందుకి మన మనస్సెందుంకు వొప్పుకోదో అర్థం అయింది. మామూలుగా సాఫీగా సాగే ఆ జీవితం నాకు వొద్దు. నేనూ మనిషినే నాకూ కోరికలున్నాయి. వాటిని గ్రహించేందుకూ, ఆచరణలో పెట్టిందుకూ కన్నవారు లేకుండా పోయారు. విచారించి యేమీ లాభం వుండదనీ, మార్గం వెతుక్కునే అవసరం నాపైనే వున్నదనీ గ్రహించాను. నా కోరిక లేవీ ఆకాశాన్నంటేవికావు. నాకూ ఓ భర్త అతని ఆదరణా, కట్టుకుందుకి బట్టా, బతికేందుకు తిండీ అవసరం అని సులభంగా తెలుసుకున్నాను. ఎంత చదివినా ఎన్ని విధాల పురోగమిస్తున్నా ఓ నీడలేనిదే స్త్రీ రాణించలేదేమో.

అన్నయ్య నిర్లక్ష్యం నా మీద బలంగా పని చేసింది. ఏం చేయను. నాకు కావలసింది పరిపూర్ణత్వంతో నిండుకున్న స్త్రీ జీవితం. 'ఆయనా' నేనూ రిజిష్టర్ వివాహం చేసుకున్నాం. కులం కాదు ప్రధానం. మీ వదిన రాధిక కెలాటి రొట్టూరాదనీ, తెలుసు నాకు. నేను అలిప్యాన్ని భరించలేక పోయాను. అంతే.

మీ

యమున.

గోవిందు యేడ్చాడు. మామూలుగా కాదు. ఆడపిల్లలకన్నా అధ్వాన్నంగా గుండెలు పగిలేట్లు యేడ్చాడు. యేడ్చి యేడ్చి అలసిపోయిన గోవిందు దృష్టికి ప్రపంచం వంచించినట్లూ, తనని చూసి నలుగురూ హేళన చేస్తున్నట్లూ భావించాడు. చివరికి అతను యెవరికీ యెదురు పడడం మానేశాడు. భూమిలో కంటూ తలని దూర్చేసి నడవడం నేర్చుకున్నాడు. పలకరించిన ప్రతివాడికీ ఓ నవ్వు విసిరేసి నాటకంలో పాత్రధారుడై పోయాడు. అతనికున్న బెంగ వొక్కటే. తను గారాబంగా పెంచుకున్న రెండు మొక్కల్లో వో మొక్కను హఠాత్తుగా ఎవరో లాక్కుపోయారు. అది రాక్షసులో, గంధర్వులో మాత్రం తెలీదు. ఈసారి మిగిలిపోయిన చిన్నారి మొక్కను తన గృహ ప్రాంగణంలో కాక బృందావనంలో తులసి చెట్ల మధ్యనే పాతాలనే నిర్ణయానికి వచ్చేశాడు. కానీ...

గోవిందు మనసూ, జీవితంతో లెక్కలేదు బృందావనికి. తులసిచెట్ల మధ్య గంజాయి మొక్కకు విలువలేదు. నీ యింటి ఆవరణలోనే వుంచుకోమని చెప్పేసింది కరుణ లేని బృందావని. మిగిలిపోయింది మొక్క యెండకు యెండి, వానకు నాని వాడిలిపోతూ.

* * *

కాలగర్భంలో యిరవై యేళ్ళు దాటిపోయాయి బాణంలా దూసుకుపోతూ. రాధికకి పెళ్ళికానేలేదు. ఒకవేళ చేసుకుందామని వచ్చిన యిద్దరు, ముగ్గురు వ్యక్తుల్లో ఒకడు రాధిక కన్నా రెట్టింపుకు మించిన వయసువాడు. మరొకడు దృష్టి ఆనక పోయినా రాధికనే తన కంటి పాపల మాదిరి చూసుకుంటానని మాట యిచ్చేశాడు. మూడో వ్యక్తి అంతకు ముందు రెండు సార్లు పెళ్ళిచేసుకుని వాళ్ళు పోయాక వియోగం భరించలేక అపరదేవదాసే అయిపోయాడు. ఓ మోతాదుమించీ, వొక అంకు యెక్కువ చదివేడు గనుక రకరకాల యిళ్ళ

తోరణాలని గమనించి కొంటెనిండా రోగాలు పెంచుకుని మరీ వచ్చేడు.

సరస్వతి ఖచ్చితంగా అనేసింది! మేము గడిగి పోయేమని యింకా నలిపేందుకు మీరెవరూ ప్రయాసపడనవసరంలేదు. నా పిల్ల నాకు బరువుకాదు. అలా అయిన రోజున దాన్ని గోదావరిలో పడేసి మేమూ దూకుతాం. మధ్యవర్తులని మిమ్మల్ని మేం కాళ్ళు అంటుకుని ప్రార్థించలేదు వెళ్ళండి,' ఆ తరువాత రాధికని గుండెల్లో యిమిడ్చుకుని కంటికీ మంటికీ యేకధారంగా యేడ్చేసింది.

* * *

'అల్లా, లేచి పోవడం అనేది తప్పా,' పుస్తకాలు గిరవాటేసి రాధిక మెడచుట్టూ చేతులువేసి అడిగాడు ముకుందు.

'ఛ! నీకలాంటి మాటలెవరు నేర్పారు? బడికి వెళ్ళేది యిందుకా?' రాధిక కోపంగా చూసింది.

ముకుందు మొహం గంభీరంగా మారి పోయింది. 'కాదత్తా. మధుసూధన్‌వాళ్ళు అన్నారు. నీకా పెద్దత్త లేచిపోయింది, కులం కాని వాడితో అని. లాస్టు అవర్‌లో అమ్మాయిలందరూ నవ్వేయడమే నన్నుచూసి. అసలు నాకూ దానికీ సంబంధం యేమిటిట,' మంచం దిగి దూరంగా నిలబడి ఓ చేతిని పాంటుజేబులోకి పోనిచ్చి మరో చేతిని క్రాఫు వెనకగా పెట్టి తల బరువుగా వెనక్కు వాల్చి యింటికప్పు మీదికి చూస్తూండి పోయాడు, ఎస్. ఎస్. ఎల్. సిలో అడుగు పెట్టిన రాధిక మేనల్లుడు.

వివరాలు చెప్పి పసిమనసు పాడుచేయడం రాధికకి యిష్టం లేక పోయింది. ముకుందు చాలాసార్లే అడిగాడు యిదివరకు. కానీ అప్పటి దాకి పరిస్థితివేరు. ఇప్పటి సంగతి వేరు.

రాధిక కళ్ళముందు అందమైన ఆశ రాలు బారులు తీరి నిలబడి పోయాయి.




పిన్నికి,

'నమస్కారాలు. నేను పిన్నీ కృష్ణను. ఎన్నోసార్లు నీకు పుత్తరం రాయాలని ప్రయత్నిస్తే అమ్మ వద్దని కేకలేసేది. అత్త మంచిదనీ, మామయ్య అప్పాయకుడనీ అమ్మ నాన్నా అంటారు. అలాంటప్పుడు పుత్తరం రాస్తే తప్పేం అంటాను నేను. నేను ఫిఫ్తుఫారంలోకి వచ్చేను. అమ్మ యెప్పుడూ యేడుస్తూ వుంటుంది.' సంకీర్ణ జాతికి పుట్టిన ఆడపిల్లవి' అని కొట్టి, తిట్టి చివరకు కౌగలించుకుని బావురు మంటుంది. ఈ సంగతి నీకు రాయాలనిపించి రాస్తు న్నాను. చిన్నప్పుడు అమ్మ అనేది' ముకుందు బావని చేసుకుంటావుటే' అని.

నాకు సిగ్గూ, బిడియంలాటివి వింతగా అనిపిస్తాయి. ఆఫ్టరాల్ వాటీజ్ దేర్. నేను బావని అడిగినట్లు చెప్పు. అత్తకి నా నమస్కారాలు తెలుపు. ప్రేమతో జవాబు కోరుతూ.

నీ

కృష్ణ.

* * *

ఉత్తరం చదివి నిట్టూర్చింది సరస్వతి. మామూలు పుత్తరాలన్నీ వొక్కసారి చదివించుకుని చించేసేది. మేనకోడలు రాసిన యీ పుత్తరం మటుకు జవహాల అయిపోయింది. ఇప్పుడు సరస్వతి వృద్ధాప్యంలోకి అడుగు పెట్టింది.

భర్త దగ్గరికి వచ్చి అతని పక్కగా జరిగి కూర్చుని అంది. 'మన ముకుందానికి పెళ్ళియీడు రాలేదంటారా.'

గోవిందు భార్య మొహంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. ఆడపడుచు పెళ్ళి చేస్తేనే కానీ యీ యింట మరో పెళ్ళి జరిగేందుకు వీలులేదని అన్న భార్యయేనా యిటు వంటప్పుడు ముకుందు పెళ్ళి విషయాన్ని గుర్తు చేసుంట?

రాధిక కొన్నాళ్ళుగా మానసిక వ్యాధిని పెంచుకుని ఆఖరికి దాన్ని శరీరానికి కూడా అంటించింది. మెల్లిగా నీరసంగా అన్న దగ్గరికి వచ్చి వదిన మొహంలో తృప్తి చూసిఅంది.

'కృష్ణని మన ముకుందానికి యిచ్చి చేస్తే మనం చేసుకున్న పాపాలు కొన్నైనా మాసిపోతాయేమో కదన్నయ్యా!'

గోవిందు పులిక్కిపడ్డాడు. హంటర్ తీసు

కుని అతని వీపుమీద ఎవరో బలంగా కొడుతున్నారు. అతని ముఖం దుఃఖంతో, బాధతో మెలికలు తిరుగుతూండి పోయింది. క్షణంలో ఆ మొహంలో 'కసి' గిరి గీసుకుని నిల్చింది.

'తెలిసింది. తెలిసింది. అది. దాని కూతురు. అది చేసిన పనికి రాధి అనుభవిస్తున్నది చాలును. నా కొడుకూ, వాడి పిల్లలూ గురికావడానికి వీల్లేదు,' అనేశాడు ఆయాసంగా రొప్పుతూ.

రాధిక చాలాసేపు యేడ్చింది. నేరం యెవరో చేస్తారు. శిక్షలు పడేవి మరెవరికో. 'కృష్ణా నీకు నేనేమీ సహాయం చేయలేను,' అంది మంచం మీద వెనక్కు వాలిపోతూ.

*　　　　*　　　　*

హాస్పిటల్లో మంచం మీద పడుకుని కుళ్లి కుళ్లి యేడుస్తున్నాడు ముకుందం. గోవిందూ, సరస్వతీ కొడుకుని ఓదారుస్తున్నారు. రాధిక మెల్లగా వచ్చి మేనల్లుడి పక్కన కూర్చుని తలమీద చేయివేసి కళ్లల్లో తిరిగే నీటిని అదుపులోకి తెచ్చుకుంటుంది 'అత్తా', అని బావురుమన్నాడు ముకుందు రాధిక మెడ చుట్టూ చేతులువేసి.

గొంతు పెగిలించుకుని అంది రాధిక. 'ఏడవకు. మన చేతిలో యేమీలేదు. ఖర్మ యిదంతా!'

'అత్తా నా కాలు,' కొట్టేసిన కుడి కాలు వంక దృష్టి నిలిపింది రాధిక. ఆ కాలు వున్న స్థానంలో కృష్ణ నిలబడివుంది కర్ర కాలుకి బదులుగా! నేను పూతగా నిలుచుంటాను పిన్ని, రాధిక కళ్ళు నులుముకుని మరీ చూసింది. శంఖాలతో వూదుతున్నట్టు అదే మాట చెవిలో రింగుమంటున్నది.

ముకుందాన్ని గుండెలకి హత్తుకుని శూన్యంలోకి చూస్తూండి పోయింది. గంట కొట్టినా ఆ రోజుకి తనే వుండిపోయింది. లేచివెళ్లే వోపికలేని రాధిక.

*　　　　*　　　　*

'ఛ! యెంత సిగ్గులేనిమాట అన్నారు మీరు. మీ పిల్లడు అవిటివాడు అని, అది పుట్టుకతో అవిటిదనీ దానికియిచ్చి ముడివేస్తానంటారా? వెలివేయడం అవిటికన్నా తక్కువేమీకాదు. మీరు నాకు భర్తే కావచ్చు. కానీ యిలాంటి అన్యాయం మాటలు అంటే నేను వూరుకోలేను', సరస్వతి విసురుగా అంది.

'ఇప్పేం చెప్పా. వాడికి కాలుతేదు. దీనికి పెళ్ళికావడం యెంతకష్టమో అనుభవించి నీకు తెలియదంటే నేను నమ్మను. మేన మామ కొడుకును అదే చేసుకోకపోతే...', నీళ్ళు నమిలాడు.

'ఇప్పుడు తెలిశాయి వాని వరుసలు. తల్లి తండ్రులు చేసినదానికి పిల్లలు అనుభ వించాలి అన్నారు మీ నోటితోనే. ఆరోజు లికా గ్రహింపుకికి లేకపోయిందన్నమాట. కృష్ణకి తల్లీ తండ్రీ వున్నారు. వాళ్ళపిల్లని వాళ్ళ స్థితిగతులకి తగిన సంబంధాన్ని యిచ్చి చేయగలరు, పెళ్ళిఅంటూ చేయా లనుకుంటే. కానీ...నేను...నేను మూర్ఖ త్వానికాను అవిటివాడికియిచ్చి దాని మనసు అవిటి చేయడానికి', కిటికీ వూచలు ఆధారం చేసుకుని నిలబడి కళ్ళల్లో నీటిని భద్రంగా గుండెల్లోకి పంపించేస్తోంది సరస్వతి.

'రాధీ', బలంగా కేక పెట్టాడు గోవిందు రాధిక అన్న యెదుట హాజరుగా నిల్చుంది. 'ఏమిటి అన్నయ్యా?' అంటూ.

'కృష్ణని ముకుందానికి చేసుకుంటా మని ఓ కార్డు రాసి పడెయ్యి అంతే,' గోవిందు గదిలో పచార్లు ప్రారంభించాడు.

రాధిక నివ్వెరపోయింది.

'ఒద్దు. వీల్లేదు ముకుందా! నువ్వునేను పోయాక ఎలాగూ అడుక్కుతింటావు. ఆ సంగతి నాకు తెలుసు. కానీ దాని బ్రతు కులో నిప్పులు పోయకు,' సరస్వతి గట్టిగా అంది.

'నువ్వు రాస్తావాలేదా రాధీ,' గోవిందు కళ్ళు ఎర్రబీరలు కముకున్నాయి.

'రాధీ,' సరస్వతి కంఠంలో వురుములు యుద్ధం చేస్తున్నాయి.

నిశ్చేష్టురాలై చూసింది రాధిక.

'నేనెలాగూ ఆట్టేకాలం బ్రతికేది లేదు. కృష్ణకీ మనకీ యెలాంటి సంబంధమూ లేదు. దానికి నువ్వు వుత్తరం రాయడానికి వీల్లేదు.'

సరస్వతి చెంప అదిరిపోయింది. గోవిందు విసవిస బయటికి వెళ్ళిపోయాడు. కాపురానికి కాలుమోపిన యిన్నేళ్ళకి సరస్వతి దెబ్బతింది భర్త చేత. యేడవలేదు అందుకు. చిన్నగా నవ్వుకుంది ఆచేతి ఆనవాలుని ప్రేమగా తడుముకుని.

* * *

మరో రెండేళ్ళకి యిద్దరూ వొకరి

# శిక్ష

వెనుక వొకరు సరస్వతి, గోవిందు అసరాగా గోవిందా స్వర్గానికో, మరి నరకానికో తెలియగాని వెళ్ళిపోయారు రాధికచేతికి ముకుందాన్ని అందించి.

రాధిక కళ్ళు యెర్రబడిపోయాయి. గదిలో దీపం వెలిగింది. గోవిందు తాలూకు, సరస్వతి తాలూకూ యిన్నాళ్ళనెన్ను డబ్బుతో రోగిష్టి బ్రతుకు రాధికా, అవిటి బ్రతుకు ముకుందూ యీడ్చేస్తున్నారు.

రాధికకు బాగా తెలుసు. చివరి ఘడి యలు అంటే యేమిటో?

అమావాస్య రాత్రులు విలయతాండవం చేస్తున్నాయి. ప్రపంచం గొంతుచించుకుని భయంగా అరుస్తున్నది రాధిక చెవుల్లో. ముకుందు రాధిక పక్కగావచ్చి కూర్చుని తలమీద చేయివేసి వెంట్రుకలు సరిచేస్తు న్నాడు. 'అత్తా' అంటూ వాడి పిలుపులో అనురాగం యుగాలకి సరిపోయేట్టువుంది.

రాధిక బలవంతంగా కళ్ళుతెరిచింది. ఆ కళ్ళల్లో జీవకళ దూరమైపోతూవుంది. అన్నా వదినా, అక్క కృష్ణ ... ఆఖరికి మిగిలిపోతున్న ముకుందూ వరుసగా కని పిస్తున్నారు.

'నాయనా ముకుందూ,' అంటోంది రాధిక. వాడు అత్త గుండెల మీద తల ఆన్చేడు.

'కృష్ణ రాలేదా బాబూ,' అంది ఆయాసంగా.

'లేదత్తా. టెలిగ్రాం కూడా యిప్పిం చాను.'

'అది రాదు. ఎందుకు వస్తుంది. పిన్ని ఎలాంటి సహాయం చేయలేదని కోపగించి వుంటుంది.'

'నువ్వు బెంగపెట్టుకోకత్తా. వస్తుంది.' ముకుందు వోదారుస్తున్నాడు. వాడి కళ్ళు తడిగా వున్నాయి. ఈ చీకట్లో కొద్దిగా వెలుగుతున్న యీ ఆముదం దీపం ఆరి పోతే వాడి బ్రతుకు కటిక చీకటి అని గ్రహించి దుఃఖాన్ని మింగుతున్నాడు.

హెూరు గాలికి తలుపులు ఛడేలుమంటూ కొట్టుకుంటున్నాయి. వీధివాకిలి తెరుచు కుంటూ కృష్ణ చేతి సంచితో వచ్చేసింది. అంతవరకూ చూడని కృష్ణని యిద్దరూ గుర్తుపట్టలేక పోయారు కాస్సేపు.

'పిన్నీ' మంచం మీదికి వొంగి చెవిలో గుసగుసలాడింది. కృష్ణ. 'ఆఁ' అంది రాధిక బలవంతంగా.

'మీరు కూర్చుందుకు స్టూలు నేను తేలేను. ఆ పక్కగదిలోనేవుంది. శ్రమ అను కోక తెచ్చుకుంటారా?', అమాయకంగా అన్నాడు ముకుందం.

కృష్ణ చురుగ్గా చూసింది.

రాధికచేతిని బలవంతంగా పైకియెత్తి కృష్ణ తలమీద వుంచింది మాట్లాడ లేకుండావున్న స్థితిలో. కృష్ణ తనలో ప్రవ హించే రక్తం తాలూకు మనుష్యుల్ని ప్రప్రథ మంగా తేరపారి చూస్తూండిపోయింది.

'వీడు నీకు బావ,' రాధికగొంతు పెగ ల్లేదు ఆపైన.

'గ్రహించేను,' కృష్ణ స్టూలు తెచ్చు కోలేదు. ముకుందు పక్కనే చోటుచేసుకుని కూర్చుంది.

'పిన్నీ నేను వచ్చేశాను. నువ్వింక బెంగ పెట్టుకోకు. అమ్మా, నాన్నకి చెప్పిరాలేదు అంతే.'

రాధిక వులిక్కిపడింది.

అంతకంతకు రాధికలో చలనం దూరమై పోతోంది. నలభై సంవత్సరాలు మార్పులేని బ్రతుకులో విసిగిపోయింది రాధిక శరీరం. సమయంవస్తే రెక్కలు గట్టుకుని పరి గెట్టాలని చూస్తూనేవుంది. 'ఎంత...పని చే...సేవు.'

రాధిక మాటవిని ముఖంలోకి గాంభీర్యాన్ని తెచ్చుకుని కృష్ణ అంది: 'ఆ తలుపులు మూసుకుపోయినా యిబ్బందిలేదు. ఈ వాకిలి మూసేదీ తెరిచేదీ నా చేతిలో వుంది.'

రాధిక మనసు కొద్దిసేపు రెపరెపలాడింది. కృష్ణ తెలివితేటలుండీ చదువుకున్న పిల్ల కావడం ముకుందం అదృష్టం అనుకుంది. రాధిక కళ్ళముందు హాస్పటల్లో ముకుందు కాలి స్థానంలో కనిపించిన కృష్ణ కదిలి ఆ పాపల్లో శాశ్వతంగా నిలిచి పోయింది.

ముకుందం అనుకున్నాడు. 'మెర్క్యురీ లైట్లు యిన్ని వొక్కసారిగా వెలిగి పోయా యేమిటి యీ అంధకారంలో' అని.

పాపం! రాధికే ... అర్థం లేని శిక్ష ఇన్నేళ్ళు అనుభవించింది, ఎవరో చేసిన దానికి.

రాధిక కళ్ళు అలాగే చలన రహితంగా వుండి పోయాయి.

అత్తయ్య నన్నుచూసి.

'ఎక్కడ కూర్చోను!'— మనసులో తట పటాయిస్తూండగానే — గోడకు జేరవేసి వున్న చాపను పరిచింది రమణ!

'గేట్ ఇన్సల్టు!' — అవమానంతో కుంచించుక పోతూనే చేసేదిలేక అక్కున కూలబడిపోయాను చాపమీద!

కుశల ప్రశ్నలయ్యాయి!

'బాబూ! యింటికి పెద్దల్లుడివి. వస్తానని, మూడురోజుల్నుంచి గంపె డాశతో ఎదురుచూస్తున్నాము. ఇవాళ పెద్ద పండగ. ఏంతకీ నువ్వు రాకపోవడంతో యింట్లో ఎవరమూ భోంచేయలేదంటే నమ్ము. పెద్దదాన్ని. చేతులుపట్టుకుంటు న్నాను. మా వల్ల ఏదైనా పొరపాటు జరి గితే మన్నించు నాయనా...'

అత్తగారి దైన్యస్థితికి ఒక వేపు హృదయం ద్రవీభూతమవుతోన్నా—అమ్మ నాన్నల హెచ్చరికలు నన్ను అనుక్షణం కర్త వ్యాన్ని గుర్తుతెస్తూ, వెన్నంటుతోన్నాయ్! నిర్లిప్తంగా వుండిపోయాను.

'రమణ అమాయకురాలు. దానికేమీ తెలీదు బాబూ! నిన్ను తలచుకోనని రోజంటూలేదు. ఎప్పుడొచ్చి తనను తీసుకు వెళ్తావా అని ... రోజూ ...' అత్తయ్య ఏంచేంటో చెప్పకపోతుందే తప్ప— ఎంతకీ కట్నం విషయంగానీ, రేడియో, ఫాన్, సైకిల్ విషయంగానీ ఎత్తకపోవడంతో ఒక వేపు చిరాకెత్తి పోతోంది నాకు! అందు లోనూ ప్రయాణపు బడలికవల్ల నిద్ర ముంచుకొచ్చేస్తోంది. 'అన్నీ సిద్ధంగా వున్నాయి' అని ఒక్క మాటంటే నాహృ దయం ఎంత తేలిక పడును! ఎంతకీ ఆ మాటరాదే! కొంపదీసి అమ్మన్నట్టు యిదంతా మోసపు కన్నీరుకాదుగదా! ఆలో చిస్తూ గుడ్డిగా వెలుగుతోన్న బుడ్డిదీపం కేసి చూస్తూ వుండిపోయాను.

'ఏం బాబూ! అలా వున్నావు. వంట్లో బాగో లేదా!' ఆశ్చర్యంగా నాకేసి చూస్తూ అడిగింది అత్తయ్య.

'అవును!' ముక్తసరిగా జవాబిచ్చి టప్పున పైకిలేచాను.

'పొద్దుట మాట్లాడుకుందాం! రా నాయనా! పడుకుందువుగానీ! దూరప్రయా ణం! బాగా అలసిపోయుంటావురా!'— మావగారొచ్చి మరోగదిలోకి తీసుక వెళ్లారు!

చిన్న మంచం. సాధారణమైన

# సంకల్ప వికల్పాలు

(15 వ పేజీ తరువాయి)

దుప్పటి దానిమీద దిండువేసుంది. వెల్ల కిలా పడుకున్నాను. నిద్రపడితేగా. సిగ రెట్ ముట్టించాను. శరీరానికి నలక గరగరా పొత్తుకపోతోంది. ఇక నిద్రేలాపడుతుంది? కళ్ళు మండుకపోతో న్నాయ్!

కూర్చొని, యింటిచూరుకేసి చూస్తూ ఆలోచిస్తూంటే నా స్థితికి నాకే జాలే సింది!

అందమైన సుమ సౌరభాల్ని వెదజల్లే గదిలో—అత్తమామలు పెట్టే హంస తూలికా పాన్పుమీద—హాయిగా మేను వాల్చాలనీ—అమృత తుల్యమైన భోజన పానీయాలు సేవిస్తూ. నెలల తరబడి అక్కడే (అత్తవారింట్లోనే!) ఆనం దంగా గడిపెయ్యాలనీ, ఉడుకులం పెంటు సువాసనల గుబాళింపులో—శ్రీమతి కౌగిట్లో కరిగిపోవాలనీ—పెళ్లనక ముందు —ఏవేవో కలలుగన్నాను. నా కలలకూ— కళ్ళముందు కన్పిస్తోన్న, జరుగుతోన్న దానికీ పోల్చి చూసుకుంటే—అమాంతంగా ఒక్కసారి దుఃఖం పొంగుకొచ్చింది.

నా మానసిక సంక్షోభం తీరేదెలా?

అడుగుల సవ్వడైతే, సిగరెట్ ఆర్పి దృష్టిని మరల్చాను.

రమణ!

'పాలు తీసుకోండి!' అంది మృదువుగా! తీసుకుంటూ, పరీక్షగా చూశాను. తెలుపు జాకెట్ మీద తెలుపుచీర కట్టుకుంది. చెవులకు రింగులుమాత్రం వున్నాయ్! గదిలో వెలుగుతోన్న కిరసనాయిలు దీపపు కాంతి వెలుగులో—మేలిమి బంగారంవంటి ఆమె సహజ సౌందర్యం మరింత ద్విగుణీ కృతమై—దేవతామూర్తిలా అగుపిస్తోంది. తలలో తురుముకున్న మల్లెలు సుమ సౌర భాల్ని వెదజల్లుతూ, మత్తును గొల్పు తున్నాయ్!

గబగబా పాలుత్రాగడం పూర్తిచేసి, 'రమణా' అంటూ చప్పున పైకిలేచాను.

'నన్ను అన్యాయం చేయకండి!' అంటూ, అమాంతంగా నా పాదాలమీద పడిపోయింది —రమణ. ఎత్తి, హృదయానికి మత్తుగా హత్తుకున్నాను.

వళ్ళు పులకరించింది.

[illegible] ఎంత హాయి వుంది—

కొన్ని క్షణాలవరకూ లోకం కనిపించ లేదు నాకు.

'వాళ్లదంతా నాటకం! నిన్ను వశపర్చు కోడానికి ఎన్నో ఎత్తులు వేస్తారు. కళ్ల బొల్లి కన్నీళ్లు కారుస్తారు. ఒంటరిగా వున్నప్పుడు నీ భార్యని పంపుతారు. జాగ్రత్త! ఆ మాయలో పడ్డావా! మిగిలేది బూడిదే! అన్ని వస్తువులూ కళ్లబడిన వరకూ కాస్త నిబ్బరం వహించు నాయనా...'— ప్రయాణానికి ముందు హెచ్చరించిన అమ్మ కంఠం వెన్నుమీద ఛళ్లున చరిచి లేపేసినట్టయింది.

అదిరిపడ్డాను.

అంతా నాటకమా!

మనసాలోచించేస్తోంది. కాకపోతే, వచ్చి ఎంతసేపయింది. కట్నం విషయంగానీ, రేడియో, ఫాన్, సైకిల్ విషయంగానీ ఎవరన్నా ప్రస్తావించడం జరిగిందా!...దగా!

అమాంతంగా సందిట్లోని రమణను దూరంగానెట్టాను. కోపం కట్టలు త్రెంచు కొచ్చింది. 'మీరు నన్ను యింకా మోస గించాలనుకుంటున్నారా! జాగ్రత్త! వాగ్దానం చేసినవి యివ్వకుండా ఇంకా నాటకమాడ దలిచారా! వెళ్లు!—'నాకు తెలీకుండానే గబ గబా అనేసి మంచంమీద కూలబడి పోయాను.

మనసులో సుడిగుండాలు ఉవ్వెత్తున లేస్తోన్నాయ్! ఎంతపొరపాటు జరిగింది? ఎంత క్రూరంగా ప్రవర్తించాను? ఇక రమణకునా ముఖమెలా చూపించను? ఆలోచ నలో బుర్రవేడెక్కిపోయింది. అలాగే నిద్రా దేవి వడిలోకి జారుకపోయాను.

* * *

అమాంతంగా మెలకువ వచ్చింది. త్రుళ్లి పడి లేచాను. చుట్టూ పరికించి చూచాను. అంతా చీకటి! గదిలోని కిరసనాయిలు దీపం ఎప్పుడో ఆరిపోయింది. 'జుయ్' మంటూ ఈదరగాలి వీస్తోంది. బహుశా అర్ధరాత్రి దాటుంటుందేమో! ఇంతకి తనకు ఎందుకు మెలకువ వచ్చినట్టు?—ఆలోచిస్తూండగానే పక్కగదిలోంచి సన్నని ఏడుపులు — మధ్య మధ్య హృదయవిదారకమైన దీనవాక్యాలు వినవస్తోన్నాయ్! చెవులు రిక్కించాను. అది మావగారికంఠం. 'ఊరుకోతల్లీ! మన కష్టాలిలావుంటే మళ్లీ నువ్వింతటి ఫలాతు కానికి పూనుకోవటం బావుండదమ్మా!

ఇంటికి పెద్దదానివి, అన్నీ తెలిసినదానివి, కష్టాల్ని తట్టుకోలేక నూతిలోపడి ప్రాణాల్ని తీసుకొని, మమ్మల్ని అన్యాయం చెయ్యాలను కున్నావా అమ్మా...'

గుండెల్లో బాంబు ప్రేలినట్టయింది! ఏమిటి రమణ ఆత్మహత్యకు పాల్పడిందా! చటుక్కున పైకిలేచాను.

'ఆయనగారికి నేనవసరం లేదు నాన్నా! భార్యకంటె వారికి భరణాలే ముఖ్యం. ఏం చేయమనా న్నా! మీరు పడేకష్టాలు చూడలేక......'

'అందుకా తల్లీ ఆత్మహత్య చేసుకోవాలను కున్నావ్? పిచ్చిదానా! ఆడపిల్లలు గన్న తలి దండ్రులకు — యీ కష్టాలూ, యీ కన్నీళ్ళూ తప్పవమ్మా తప్పవు!... మంచి సంబంధం దొరికిందిగదా అని ఎంతో ఉబ లాట పడ్డాను. కానీ, భగవంతుడు మన కెందుకో—అన్యాయం చేశాడమ్మా! నీ పెళ్లి కోసం మన షాహుకారుగారి దగ్గర మూడు వేల రూపాయలు కూడబెట్టాను. మన దుర దృష్టం కొద్దీ, పెళ్లికి వారం రోజులు ముందు, షాహుకారుగారు లారీ ప్రమాదంలో చనిపోయారు. పోటూ, పత్రం లేని కారణం చేత—షాహుకారుగారబ్బాయి తనకా విషయం తెలీదన్నాడు. ఏం చేయను? అందుకే తల్లీ... పెళ్లిలో అల్లుడిగారి ముచ్చట్లు తీర్చ లేక పోయాను. లేకపోతే, అల్లుడిగార్ని యిన్నిసార్లు అడగనిస్తావా అమ్మా...!'

బుర్ర వేయి చెక్కలవుతున్నట్లయింది. మనసులో ఏదో ఆరాటం ప్రారంభమైంది!

గుమ్మం దగ్గరకొచ్చాను.

'మీ అమ్మ పరిస్థితి చూడమ్మా! ఆ ఉబ్బసపు జబ్బుకు ఒక అరడజను ఇంజ క్షన్లూ, మంచి టానిక్కులు వాడితే గుణ మిస్తుందని డాక్టరుగారు శతవిధాలు చెప్పారు వింటేగా! తన జబ్బు నయంకోసం ఆ వున్న వంద రూపాయలూ ఖర్చుపెట్టేసే బదులు—పండగకొచ్చిన అల్లుడికి అరతులం ఉంగరం చేయించిపెట్టమని మంకుపట్టు పట్టుక్కూచుంది......'

—భగవాన్! తల తిరిపోతోంది నాకు. అల్లుడికోసం యింత త్యాగమా! గుండెల్లో గునపాలు దొర్లేస్తున్నాయ్!

'ఇక మీకేం భయంలేదు! అన్ని ఏర్పాట్లూ పూర్తి చేశాను. అల్లుడిగారీసారి ఆనందంగా అమ్మాయిని తీసుకొని వెళ్తాడు. సంతోషంగా నా రమణ కాపురం చేస్తుంది...'

'ఏమిటండీ మీరంటున్నది... ఆ వున్న చిక రాన్నర పొలమూ అమ్మేస్తారా...!'

'లేదే! అదేదీకాదు. సమయ మొచ్చింది గనుక చెప్తున్నాను. మన కష్టాలు నేటితో పూర్తిగా గట్టెక్కాయి. రమణతోపాటు, నా మిగతా అయిదుగురు కూతుళ్ళకీ పెళ్లిళ్ళు జరుగుతాయి. అందరిలాగే నా కూతుళ్ళూ సంతోషంగా కాపురాలు చేస్తారు. వినండి...! పదివేల రూపాయలకు మూడు నెలల క్రితం ఇన్సూర్ చేయించుకున్నాను. ఈవాళే మూడో ప్రీమియం కూడా కట్టే శాను...పోతే రేపు......'

ఒక్కసారి ఏడుపులు గొల్లుమన్నాయి!

నా నెత్తిమీద పిడుగుపడింది! గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలై పోతున్నాయ్!

'...అంటే పదివేల రూపాయలకోసం మావగారు ప్రాణాలు పోగొట్టుకుంటారన్న మాట...!'

ఆలోచించ లేకపోయాను.

నా కళ్ల ముందున్న మంచుతెరలు ఒక్కొ పున తొలగిపోయాయి. హృదయం 'పటాక్కరు'తో పిండేసి నట్టయింది. కూతుళ్ల పెళ్లిళ్లకోసం—అలుళ్ల కట్నాల కోసం—ఆడపిల్లల తలిదండ్రులు యింతటి బాధాకరమైన, నికృష్ట జీవితాన్ని గడుపు తున్నారన్న విషయం అప్పటిగ్గానీ నాకు తెలిసి రాలేదు!

'మావగారూ !' — పొంగు కొస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అప్రాంతంగా రెండ డుగులు ముందుకు వేశాను.

ఎదురుగా—కటిక నేలమీద—చలిలో—కప్పుకోడానికికూడా సరైన బట్టలులేక నా అయిదుగురు మరదళ్లు, నిద్రాదేవిఒడిలో లీనమై వున్నారు. పైన ప్రసరిస్తున్నవెన్నెల కాంతిలో ఆ హృదయవిదారక దృశ్యాన్నొట్టే చూడలేకపోయాను. నాకు తెలీకుండా నే కన్నీళ్లు రాలిపోతోన్నాయ్! పరుగెత్తాను.

హఠాత్తుగా నేను—ఆ సమయంలో—వాళ్లముందుకొచ్చి నిలబడేసరికి అంతా నిర్ఘాంతపోయారు. రమణ చాపమీద పడి వెక్కి వెక్కి ఏడుస్తోంది. ప్రక్కన మావ గారు రెండుకాళ్లనందునా తలవుంచి తనలో తనే వ్యధపడుతూ వుండడం గమనించాను. అస్థిపంజరంలా తయారైన అత్తగారు, శోకమూర్తిలా రోదిస్తూంటే నాకు మతి పోయినట్టయింది.

'నేనంతా విన్నాను' మెల్లగా అన్నాను.

'ఆఁ!'

'అవును !'

'మా దౌర్భాగ్యపు కథ అంతా విన్నావా బాబూ! అయినా అదంతా పట్టించుకోకు నాయనా! నీ ముచ్చట్లన్నీ పూర్తిచేసే అమ్మాయిని పంపిస్తాను. అనవసరంగా నిద్రా భంగం కలిగించాను. రా నాయనా!పడు కుందువుగాని...' పైకి లేచారు మావగారు...

ఎంత గుండెనిబ్బరం! రమణ వెక్కి వెక్కి ఏడుస్తోంది! దగ్గరకువెళ్లి, రమణను రెండు చేతులతోనూ దగ్గరకు తీసుకున్నాను.

అత్తమావల ఆశ్చర్యానికి అంతులేదు.

'ఈ పరిస్థితులకు, కష్టాలకు మీరు బాధ్యులుకారు. ఇప్పటివరకు విశాల దృక్ప థంతో ఆలోచించలేని అజ్ఞానినయ్యాను. ఇకపైమీ బాధల్లోనూ, కష్టాల్లోనూనేనూ పాలుపంచుకుంటాను......నన్నునమ్మండి.'

ఒక్కసారి అందరి ముఖాలు విప్పారాయి.

'నిజంగానా! ఇది నా అదృష్టం బాబూ!' అన్నారు మావగారు — నా రెండు చేతులూ పట్టుకొని సంతోషంతో. ఆయన మాటలు తడబడుతున్నాయ్.

'కాదు — నా కర్తవ్యం!' అన్నాను తేలిక పడ్డ మనస్సుతో—దృఢంగా !



# పద్మనాభం ఎందుకు

మీకు దెయ్యాలమీద నమ్మకం వుందా?

జి. ఆర్. కుమారి, అంబాలా.




దెయ్యాలా, గియ్యాలా? అవి కనబడితే చాకిరేవులో బట్టలు వుతికినట్లు వుతుకుతాను...ఏమన్నారూ? దెయ్యాలా...అయ్యా బాబోయ్!

అబ్బ, నిర్దోషిలో గీతాంజలితో ఎంచక్కా ఉన్నారండీ!

కానూరి రాజేందర్, విజయవాడ.

ఏం, మీకు కూడా కొద్దిగా కావాలా?

కొందరుతారలు తమపేర్లు మార్చుకుంటా రెందుకు?

ఎ. రాజేంద్రబాబు, హల్వార.




తమదశ అప్పటికైనా మారవచ్చునేమో అని.

సినిమాలు లేకపోతే ప్రపంచం ఎలా వుండేది, సార్?

వై. సత్యనారాయణ, నిజామాబాద్.

జనం లేని సినిమాహాలులా.

జంటకవులవలె, జంటహాస్యనటులు ఉన్నారా?

ఎస్. గోవిందయ్య, కొత్తగ్యాదిగకుంట.

ఉన్నారు. లారల్ — హార్డీ, బాలకృష్ణ - పద్మనాభం.

సినిమాకథలో మధ్య మధ్యన హాస్యం పెడతా రెందుకండీ?

ఎం. విరంచిస్, వరంగల్.

హాస్యం పెట్టకపోతే హారాయించుకో లేరని!

టెలిఫోన్‌ద్వారా ముద్దు పెట్టుకోవడం బాగుంటుందా?

కె. వి. జి. సుందర్, హైదరాబాద్.




ఏం, నేరుగా ప్రయత్నిస్తే మీకు సన్మానం ఏమైనా జరిగిందా?

వచ్చేజన్మలో మీ అంతటి హాస్యనటుడినై మీలాగా కీర్తి పొందాలని నాకు ఎంతో కోరికగా వుంది. అందుకు మీకేమయినా అభ్యంతరమా?

నిరభ్యంతరం!

నిజంగా మూడో ప్రపంచయుద్ధం వస్తే మన గతి ఏమిటి?

ఎం. ఎస్. ఎన్. మూర్తి, వైజాగ్.

ఎండలో ఇల్లులు మాడినట్లు మాడతాం!

ఉన్నట్టుండి మీనందరికీ పూర్వజన్మజ్ఞానం కలిగితే ఏమవుతుంది?

యస్. ప్రసాద్, మద్రాసు—17.



తికమక, మకతిక అయి కలగూరగంప అవుతుంది.

మీరు ఏచిత్రంలో అయినా హంతకునిపాత్ర ధరించారా? ధరిస్తే ఆపాత్ర ఏచిత్రంలోనిది?

ఎస్. వాగేశ్వరరావు, హైదరాబాద్.

ధరించాను—భార్యా భర్తలు చిత్రంలో.

మీరు దుర్యోధనుని పాత్రవేయగా చూసి ఆనందించాలని వుంది. వేస్తారా?

ఆర్టిమస్, పాలకొండ.

మీరు చూసి సహిస్తామంటే, ఆనందిస్తామంటే — దుర్యోధనుడేమిటి, ఘటోత్కచుడు కూడా వేస్తాను.

పొట్టిప్లీడరుగారు, నా ఎత్తు 5 అడుగుల 2½అం. మరిమీరు నాకంటే పొట్టా లేక పొడుగా?

బి. శ్రీనాథరావు, బళ్లారి.

మీ కంటే రెండంగుళాలు పొడుగే లెండి!

నాభంగారూ, తెలుగుసినిమాల్లో కొత్త నటీనటులతో పాటు కొత్త గాయని గాయకులు ఎవరూ పరిచయం కాలేదు. ఎందుకు?

కె. ఉదయనాథ్, తిరుపతి.

మర్యాద రామన్నలో కొత్త గాయకుడు బాలసుబ్రహ్మణ్యాన్ని పరిచయం చేశాం. మీరింకా చూడలేదా దైనాథ్ గారూ! మీరు నా పేరులో రెండక్షరాలు తింటే— మీ పేరులో నేను ఒక్కక్షరమే తిన్నా. డోన్ట్ వర్రీ.

నేను ప్రధాని, మీరు ప్రెసిడెంటు అయివుంటే ఈదేశం ఎలావుండేదో కాస్త చెబుతారా?

ఆర్. వి. రామారావు, వేటపాలెం.

ప్రస్తుతం 'బీహారు' లాగా వుండేది.

చంద్రమండలంలో అడుగుపెట్టే ప్రప్రథమ మానవుడిగా మిమ్మల్ని ఆహ్వానించారనుకోండి. అప్పుడు మీరేం చేస్తారు?

కె. శ్రీనివాసశాస్త్రి, బేతవోలు.



ధైర్యంగా రాకెట్లో అడుగుపెట్టి, అది పైకి ఎగిరేసమయానికి నేను కిందకి ఎగిరి 200 మైళ్ల స్పీడుతో యింటికి పరుగెత్తుకుంటూ వచ్చి ముసుగుతన్ని పడుకుంటా.

మానవ జీవితంలో అతిభయంకరమైన దశ ఏమిటి?

వి. లక్ష్మీరాజారాం, ములుగు.

ఉరిశిక్ష విధించబడిన నేరస్థుని మరణ దశ.

## బహుమతిపొందిన ప్రశ్న

మొట్టమొదటిసారిగా ఒకఅమ్మాయికి ప్రేమలేఖ రాసేటపుడు చేయి వణుకుతుంది. గుండె దడ దడలాడుతుంది, ఎందుకు?

కె. వి. రాజబాబు, విజయవాడ.



అదంతా చిదంబర రహస్యం. మరీ చిన్న పిల్లాడిలా అడిగితే ఎలా చెప్పండి? మొట్టమొదటి సారి దొంగపనిచేసే వాడికి, పరీక్షల్లో కాపీ కొట్టేవాడికి, ప్రేమ లేఖ రాసే వాడికి మీరు చెప్పిన లక్షణాలు ఉంటాయి.

'మిస్టర్ పద్మనాభం అన్‌డిమూన్' ఎపుడు?

రాజా, బబ్బూరు

కథరాసి, నేను డైరెక్ట్ చేసి— మీరు చూసినప్పుడు.

పద్మనాభం

# కె. ఆర్. విజయ

తమిళచిత్ర పరిశ్రమలో నటిగా కుమారి కె. ఆర్. విజయ కొక ప్రత్యేక స్థానం వున్నది. నేడు విడుదలవుతున్న తమిళ చిత్రాలలో ఆమె నటించని చిత్రాలు అరుదుగా కనిపిస్తూ ఉంటవి. నటిగా విజయ యీనాడు అంతటి ఉన్నతశిఖరాల నధిరోహించింది. ఇంత ముందుకు రావడానికి ఆమె అంతకు ముందు ఎంతో కృషిచేసింది. చలనచిత్రాలలో నటించేందుకు విజయకి మొట్టమొదటగా అవకాశం కల్పించిన వ్యక్తి, ప్రఖ్యాతరచయిత, దర్శకుడు కె ఎస్. గోపాలకృష్ణ. ఆయనే రాసి, నిర్మించి, దర్శకత్వంవహించిన 'కర్పగం' కుమారి కె. ఆర్. విజయ నటించిన తొలిచిత్రం.



'వైవిధ్యంగల చక్కటి పాత్రలు పోషించాలని నాకోరిక'

1947 ఫిబ్రవరి 19 న విజయ త్రిచూర్‌లో జన్మించింది. ఆ యింట జన్మించిన నలుగురు ఆడపిల్లలలో విజయ పెద్దది. బాల్యంనుంచీ ఆమె నాట్యమన్నా, నటనన్నా ఎంతో కుతూహలం కనపరిచేది. నాట్యంపట్ల, నటనపట్ల ఆమెకుగల ఆసక్తి దినదినప్రవర్ధమానం అవుతూ వచ్చింది. చిరుతప్రాయంనుంచే నృత్యంలో శిక్షణ తీసుకోవటం ప్రారంభించింది.

విజయలోని ఉత్సాహాన్ని కృషిని గమనించి కె. కెస్. గోపాలకృష్ణ 'కర్పగం చిత్రంలో మొదటిసారిగా వేషం యిచ్చారు. ఆ వేషపోషణలో విజయ చక్కటి నేర్పు కనపరచింది. ఆ చిత్రం విడుదలయింతర్వాత అనేకచిత్రాలలో నటించే అవకాశాలువచ్చినవి. కుమారి విజయ చిత్రపరిశ్రమకు వచ్చిన యీ నాలుగేళ్లలోనుసుమారు 40చిత్రాల్లో నటించింది. ఒకదానికొకటి భిన్నమయిన యీ పాత్రల పోషణలో విశేషమయిన సాధన చేయటంవల్లనే యీనాడు అగ్రశ్రేణి నటి కాగలిగింది విజయ.

ఇదయకమలం (ఇల్లాలు) లో రాధపాత్ర తన కెంతగానో నచ్చిందంటుంది విజయ. తెలుగులో గీతాంజలి వేసినవేషం అరవంలో విజయ వేసింది. అదేగాక, నెంజిరుక్కుమ్ వరై, చిన్నంజిరుఉలగమ్, పంచవర్ణక్కిళి చిత్రాలలోని పాత్రలుకూడా తన కెంతో నచ్చాయని అంటుంది.

ఇటీవలనే ఆమెను శారదాస్టూడియోలో నటరాజా ప్రొడక్షన్స్‌వారి తమిళ చిత్రం సెట్స్‌లో కలిశాను. మునుపటికన్న తెలుగు ఉచ్చారణ స్పష్టంగాను, చక్కగాను ఉన్నది. ''బాగున్నారా, చాలాకాలమయింది మిమ్మల్ని చూసి:'' అన్నది, నవ్వుతూ. ప్రతినమస్కారం చేస్తూ ''అవును, రెండేళ్ళు అవుతున్నది'' అన్నాను. ''ఇప్పుడు ఏచిత్రాల్లో నటిస్తున్నారు?'' ''టైగర్ ప్రొడక్షన్స్‌వారి'' 'అసాధ్యుడు', ఏ. వి. యం. వారి 'రాము'



అధరాలపై లాస్యంచేసే దరహాసం

తెలుగులో నటిస్తున్నాను. తెలుగు నిర్మాతలు అనేకమంది వస్తున్నారు, తమ చిత్రాల్లో నటించమని. కాని, నాకు తమిళ చిత్రాల వొత్తిడి ఎక్కువగా ఉందండీ! వీటి హడావిడి కొంత తగ్గాకగాని ఒప్పుకోలేను" అన్నది చిరునవ్వుతో. ఆ చిరునవ్వు ఆమె పెదవుల మీద ఎప్పుడూ మెరుస్తూనే వుంటుంది. పసిపిల్లల్లోని అమాయకత్వమూ, నైర్మల్యమూ విజయ వదనంలో స్పష్టంగా గోచరిస్తాయి.

శ్రీ కృష్ణ పాండవీయం చిత్రంద్వారా తెలుగువారికి పరిచయమై, పరమానందయ్య శిష్యులకథద్వారా—వారి ఆదరాభిమానాలను దోచుకున్న కుమారి కె. ఆర్. విజయ, తెలుగు భాష అన్నా, తెలుగు పలుకు అన్నా ఎంతో గౌరవం కనపరుస్తుంది. "పెళ్లి ప్రయత్నాలు ఏమైనా చేస్తున్నారా?" అన్న నా మరో ప్రశ్నకు విజయ సమాధానమిస్తూ లేదు. ఇప్పుడప్పుడే పెళ్లిచేసుకునే ప్రయత్నాలేమీలేవు...వైవిధ్యంగల ఇంకా చక్కటి వేషాలు పోషించాలన్నది నాప్రస్తుతకోరిక." అన్నది.

మాట మంచితనం, నెమ్మది, సంస్కారం అలవర్చుకున్న కుమారి కె. ఆర్. విజయ తీరికవేళల్లో తల్లితోను, చెల్లెళ్లతోను కాలక్షేపం చేస్తుంది. ఎంత పనిచేసి అలసిపోయినా ఆమె అధరాలమీద దరహాసం అలా మెరుస్తూ ఉండటం ఒక ప్రత్యేకత!

—మోహన్ కుమార్

ఫొటోలు: ప్రభాకర్ ●













# చిత్రలహరి

■ శ్రీ జ్యోతి ప్రొడక్షన్స్ అనే కొత్త సంస్థ 'ముగ్గురు మరాఠీలు' చిత్రం నిర్మిస్తున్నది. ఈ చిత్రం వాలాకు షూటింగ్ అవుట్ డోర్‌లో ప్రారంభమయింది. కైలాస నాథకోనలో శ్రీ శ్రీ రాసిన 'ప్రజలను కాచే భారము, పరిపాలకులందరి ధర్మము' అనే పాటను శోభన్‌బాబు, బాలయ్య, రామకృష్ణలమీద చిత్రీకరణ జరిపి వచ్చారు. ఈ పాటను ఘంటసాల, పి. బి. శ్రీనివాస్, యస్. పి. బాలసుబ్రహ్మణ్యం పాడారు. గుమ్మడి, జి. వరలక్ష్మి, కృష్ణకుమారి, రాజశ్రీ, జ్యోతి, సుకన్య, విజానా కుమారి, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, పెరుమాళ్ళు, జయరాం యితర ముఖ్యపాత్రధారులు. సంభాషణలు : వి. ఎల్. ఎన్. ఆచార్య, పాటలు: శ్రీ శ్రీ, కొసరాజు, సి. నారాయణరెడ్డి, సంగీతం : టి. వి. రాజు, కెమెరా: జానకిరాం, కళ: వాలి, కూర్పు: యస్. పి. యస్. వీరప్ప, సహకారదర్శకుడు: డి యస్. ప్రకాశరావు, నిర్మాతలు: పి. కోటయ్య చౌదరి, గుడివాడ కృష్ణస్వామి, దర్శకత్వం: పి. సాంబశివరావు. ఈ చిత్రం రెండవ షూటింగు షెడ్యూలు యీనెల 29 నుంచి వీనస్‌లో ఆరంభ మవుతుంది.

* * *

విశ్వశాంతి పిక్చర్స్‌వారి 'నిలువుదోపిడి' సాంఘికచిత్రం యీ 11 వ తేదీ ఉదయం గం. 8—25 కి వీనస్‌లో ప్రారంభించారు. ఆశ్రమం సెట్టువేసి రెండురోజుల పాటు షూట్‌చేశారు. ఈ షెడ్యూల్లో యన్. టి. రామారావు, కృష్ణ, నాగయ్య, ఇరవైమంది బాలానందం విద్యార్థులు పాల్గొన్నారు. సంభాషణలు: టి. పి. మహారథి, సంగీతం: కె. వి. మహాదేవన్, కళ: యస్. కృష్ణరావు, కూర్పు: అర్. హనుమంతరావు, కెమెరా: జి. కె. రాము



''మరపురానికథ''లో కాంచన

నిర్వహించే యీ చిత్రానికి దర్శకుడు: సి. యస్. రావు, నిర్మాత: యు. విశ్వేశ్వరరావు వి. యస్. సి. పైన పాల్గొన్నవారితోపాటు నాగభూషణం, సూర్యకాంతం యీ చిత్రంలో నటించేందుకు ఒప్పందం జరిగింది. మిగిలినవారినికూడా త్వరలోనే ఎన్నికచేస్తారు.

* * *

నటి రాజశ్రీ అక్క కుమారుడు చి. వెంకటరమణారెడ్డి బి. ఇ (ఆనర్స్) వివాహం యీ నెల 14 ఉదయం గం. 7.40—9.52 మధ్య నెల్లూరు జిల్లా కోవూరులోని సుందరమహల్‌లో జరిగింది. వధువు చి. సౌ. మనోహరి గండవరం వాస్తవ్యులయిన శ్రీ ఎం. లక్ష్మి నారాయణరెడ్డిగారి పుత్రిక. వరుడు వైజాగ్ పోర్టుట్రస్టులో అసిస్టెంట్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా ఉంటున్నారు.

* * *

డి. వి. యస్. ప్రొడక్షన్స్‌వారు తమ మూడవచిత్రంగా యీసారి ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు, ఈ చిత్రాన్ని యీ నెల 14 వ తేదీ ఉదయం 9 గం. లకు ప్రసాద్ స్టూడియోలో ప్రారంభించారు. శ్రీ సుందర్‌లాల్ నహతా కెమెరా స్విచ్ ఆన్ చేయగా హాస్య నటుడు రేలంగి క్లాప్‌కొట్టారు. మొదటిరోజు షూటింగులో యన్. టి. రామారావు, పద్మనాభం పాల్గొన్నారు. జయలలిత, కృష్ణకుమారి, నాగభూషణం, అల్లు రామలింగయ్య యితర ముఖ్యభూమికలను పోషిస్తున్నారు. సంభాషణలు: డి. వి. నరసరాజు బి. ఏ. గీతాలు: సి. నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం: టి. వి. రాజు, కళ: తోట, కెమెరా: జి. కె. రాము. కూర్పు: జి. డి. జోషి, దర్శకుడు: యోగానంద్, నిర్మాత: డి. వి. యస్. రాజు.

* * *

కె. బాలచందర్ రాసిన ప్రసిద్ధ తమిళ నాటకం 'మేజర్ చంద్రకాంత' ఆధారంగా శ్రీ విజయభట్ మూవీస్ సంస్థ తెలుగులో ఒక చిత్రం నిర్మించబోతున్నది. యస్. వి. రంగారావు, జయలలిత, చంద్రమోహన్, రమణారెడ్డి యింతవరకు ముఖ్యభూమికలు పోషించేందుకు ఎన్నుకోబడినారు. సంభాషణలు, పాలగుమ్మి పద్మరాజు దర్శకుడు: ఐ. యన్. మూర్తి, నిర్మాతలు: యస్. యస్. భట్, పి. ఏకాంబరేశ్వరరావు. జూలై నుంచి షూటింగ్ ఆరంభం అవుతుంది.

* * *

విశాలాంధ్రలో విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న రామకృష్ణ యన్. ఏ. టి. వారి 'ఉమ్మడి కుటుంబం' చిత్రం— మాస్కోలో జూలై 5 నుంచి 20 వరకూ జరుగనున్న రష్యన్ చలనచిత్రోత్సవంలో

సౌతిండియన్ ఫిలిమ్ ప్రొడ్యూసర్స్ గిల్డ్ వారిద్వారా పాల్గొంటున్నది.

*    *    *

కె. సి. ఆర్. ఫిలిమ్స్ అనే సంస్థ 'సెల్వం' తమిళ చిత్రాన్ని తెలుగులోకి అనువదిస్తున్నది. గ్రహబలం, రాశిఫలం, హస్తసాముద్రికం మానవజీవితంపై ఎలాంటి ప్రభావాన్ని కలిగి ఉంటవో యీ చిత్రం నిరూపిస్తుంది. శివాజీ గణేశన్, యస్. వి. రంగారావు, నాగయ్య, కె. ఆర్. విజయ, నాగేష్, రమాప్రభ ముఖ్యభూమికలు పోషించిన యీ చిత్రానికి కథ, దర్శకత్వం: కె. యస్. గోపాలకృష్ణ, సంగీతం: కె. వి. మహదేవన్, మాటలు, నిర్వహణ: కె. యం. నాయుడు, కూర్పు: బాబు, నిర్మాత: కె. చంద్రశేఖరరెడ్డి.

*    *    *

చలన చిత్రాల నిర్మాణానికి బొంబాయిలో ఎక్కువ సౌలభ్యమా? అనే చర్చ వచ్చినపుడు శ్రీ డూండీ ఆ విషయంగురించి ప్రస్తావిస్తూ 'బొంబాయికన్న మద్రాసే ఎక్కువ అనువుగా వుంటుంద'ని చెప్పారు. 'ఇక్కడ స్టూడియోలో పనివాళ్లు కూడా నిర్మాతతో సహకరిస్తారు. అక్కడ అలా కాదు. యూనియన్ వుంది. ఆ యూనియన్‌కి కట్టుబడివుంటారు. సాయంత్రం ఆరయితే ఎవరూ పనిచేయరు. అన్నారాయన. కళాకారులకిచ్చే ప్రతిఫలాలగురించి చెబుతూ' పెద్ద ఆర్టిస్టులకు తప్ప జూనియర్ ఆర్టిస్టులకు యిక్కడ మనం యిచ్చే మొత్తాలకన్న ఎంతో తక్కువ వుంటుందన్నారు...శ్రీ డూండీ, సుందర్ లాల్ నహతా కలసి నిర్మిస్తున్న 'ఫర్జ్' (గూఢచారి 116) హిందీ చిత్రం షూటింగ్ యీ 9 నుంచి వాహినీలో షూటింగు జరుగుతున్నది. జూలై 9 వరకూ కొనసాగుతుంది. దానితో 'ఫర్జ్' నిర్మాణం పూర్తవుతుంది. మరొక రెండుపాటల చిత్రీకరణతో వారు నిర్మిస్తున్న తెలుగు చిత్రం 'మరపురానికథ' కూడా షూటింగ్ పూర్తి చేసుకుంటుంది.'

—మోహన్‌కుమార్ ●



'పార్వతీ శపథం'లో కాంతారావు, రాజశ్రీ



"లక్ష్మీనివాసం"లో వాణిశ్రీ



"మరపురాని కథ"లో కృష్ణ, వాణిశ్రీ

# శ్రీ కృష్ణ మహిమ

కుచేలోపాఖ్యానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తూ నిర్మించిన చిత్రం 'శ్రీకృష్ణమహిమ' అనే కృష్ణలీలలు. అందరికీ తెలిసిన కృష్ణలీలల్ని అపురూపంగా శ్రీ కృష్ణ మహిమలో చూపించుదామనుకున్నారు నిర్మాతలు. చిన్ని కృష్ణుని లీలలు ప్రేక్షకులు ఓపికగా చూడగలిగితే తర్వాత నగంలో తప్పకుండా 'శ్రీకృష్ణమహిమ' మహిమను చూస్తారు.

చిత్రానికి శిరోమాణిక్యం సి.యస్.ఆర్. ఆంజనేయులు. కీ. శే. సి. యస్. ఆర్. ఇందులో కుచేలునిపాత్ర ధరించారు. కన్నుల పండువగా నటించారు. మరచిపోయిన ప్రజలను మరోసారి ముగ్ధుల్ని చేస్తారు. అయిన్ను కుచేలపాత్రలో సజీవంగా చూడడానికయినా జనం ఈ చిత్రాన్ని చూస్తారు.

శ్రీ కృష్ణుడుగా కాంతారావు ప్రశంసనీయంగా నటించారు. కుచేలుని భార్యగా నటించిన నటి అత్యుత్తమంగా నటించింది.

నృత్యాలు, పాటలు బాగున్నాయి. డబ్బింగ్ చిత్రమయినా, విశ్రాంతి తర్వాత అలా అనిపించదు!

శ్రీ రంగా అండ్ చిత్రాంజలి వారి శ్రీ కృష్ణమహిమకు మాటలుపాటలు అని సెట్టిరాశారు. దర్శకత్వం: పి. సుబ్రహ్మణ్యం. నిర్మాతలు టి. బ్రహ్మానందరెడ్డి, కె. జె. మోహన్.

— సికరాజు.

# అపీ - యుపీ...

### వికలాంగుల శిక్షణ కేంద్రం

మైలాపూర్ రౌండ్‌టేబిల్ నెం. 3 వారు నిర్వహిస్తున్న వికలాంగుల శిక్షణకేంద్రంలో 'బెంచ్ ఫిటింగ్' శిక్షణ పూర్తి చేసిన మొదటి బృందానికి సర్టిఫికెట్‌లనిస్తూ మద్రాసు పర్యటనలో ఉన్న లండన్ వరల్డ్ కౌన్సిల్ ఆఫ్ యంగ్ మెన్స్ సర్వీస్ క్లబ్ అధ్యక్షులు శ్రీ గోర్డన్‌హిల్ ధనిక దేశాల నుంచి అభివృద్ధి చెందుతున్న దేశాలకు సహాయావకాశాలు విస్తృతంగా వున్నాయని అన్నారు. పుస్తకాలు, అవసరమైన సాధన సామగ్రి, పత్రికలు, ధనరూపంలో విరాళాలు అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఆ యా దేశాలలోనున్న సభ్యసంస్థల ద్వారా అందజేయవచ్చని ఆయన అన్నారు. వరల్డ్ కౌన్సిల్ ఒక కొత్త పథకం ద్వారా పర్యటనకు కొంత మొత్తాన్ని కేటాయించిందని, తద్వారా దానికిసంబంధించిన అనేక సంస్థల సభ్యులు ఒకరో, యిద్దరో ప్రతినిధులను విదేశాలకు పంపితే అంతర్జాతీయ అవగాహనకు వీలవుతుందని ఆయన వివరించారు. ఈ సభకు అధ్యక్షత వహించిన మద్రాసు ఎంప్లాయిమెంట్ అండ్ ట్రైనింగ్ డైరెక్టర్ శ్రీ ఎం. ఎల్. ఛాబ్రా మైలాపూర్ రౌండ్ టేబిల్ నెం. 3 కృషిని అభినందించారు. ప్రభుత్వం యిలాంటి సంస్థలకు సహాయాన్నందించాలికానీ తన చేతులలోకి తీసుకోరాదని అన్నారు. మద్రాసు ప్రభుత్వం ఈ సంస్థ సహకారంతో 100 మంది వికలాంగులకు, వారికి తగిన వృత్తులతో శిక్షణ యిచ్చే ఒక పెద్ద పథకాన్ని తయారు చేస్తున్నదని కూడా శ్రీ ఛాబ్రా అన్నారు. శ్రీ ఎస్. కె. గుప్తా ఆహూతులకు స్వాగతం చెప్పారు. శ్రీ ఆర్. దేశికన్ వందన సమర్పణ చేశారు.

(ఓ. వి.)

* * *

కేరళ, మైసూరు, రాష్ట్రాలలో 12 ప్రదర్శనలిచ్చి, ఆంధ్రదేశంలో ప్రస్తుతం ప్రదర్శనలు ఇస్తున్న 'అల్లూరి సీతారామరాజు' నాటకబృందమయిన హైదరాబాదు సెక్రెటేరియట్ కల్చరల్ ఎసోసియేషన్ వారికి నాటకరచయితకి 11—1—17 నాడు రాజమండ్రిలో సన్మానం జరిగింది.

— ఓ. వి.

* * *

కేంద్రప్రభుత్వం పరిశ్రమల మంత్రిత్వ శాఖవారు ఇటీవలే విజ్ఞానశాస్త్ర పరిశోధనలో నూతనవిషయాలు కనుగొన్న కొందరికి బహుమతులు ఇచ్చారు. వీరిలో శ్రీ అ. విశ్వేశ్వరరావుగారు ఒకరు. వీరి పరిశోధనల ద్వారా సముద్రం పాచినుంచి 'సోడియం ఆల్జినేటు' అనే పదార్థాన్ని తయారు చెయ్యవచ్చు. ఈ పదార్థాన్ని ఆహార, వస్త్ర పరిశ్రమలలో విరివిగా వాడుతారు. శ్రీ రావుగారు ప్రస్తుతం 'సాల్ట్ రిసెర్చి ఇన్‌స్టిట్యూటు'లో పనిచేస్తున్నారు. — ఓ. వి.

# పుస్తకాలు

## మధురవేదన

రచయిత: శ్రీ చిలకమర్రి రామానుజాచార్యులు క్రౌను 10+48 పుటలు. వెల రూపాయిన్నర. ప్రకాశకులు: సాహితీ బంధు బృందం, వరంగల్లు. ప్రతులు దొరుకు చోటు— చందా నారాయణ శ్రేష్ఠి, వరంగల్లు.

పన్నెండేళ్ళ కిందట వరంగల్లులో సాహితీబంధు బృందం యేర్పడి రెండేళ్ళు మాత్రం చక్కగా పనిచేసి "తొలికారు" అనే కవితా సంపుటిని ప్రకటించి మరుగు పడిపోయింది. తిరిగి యిప్పుడు నూతనోత్సాహంతో పని చేయ ప్రారంభించి యీ ఖండకావ్య సంపుటిని ప్రకటిస్తూ ఉన్నది. దీని సంయోజకులైన జగన్నాథంగారు తమ మాటలో "నేటి భారతీయ సమాజంలోని అవ్యవస్థ సాహిత్యంలో ప్రతిబింబిస్తూ వున్నది. విజాతీయ మోహమూ, ఆత్మధర్మ విరుద్ధమూ, కుసంస్కార ప్రోత్సాహకమూ అయిన సాహిత్య సృష్టి విరివిగా, వివిధ వాదాల తర్క ప్రోద్బలంలో విజృంభిస్తున్నది. ఏది ఏమైనా మానవ జీవితాన్ని భౌతిక జీవనావరణ నుండి ఉన్నత భూమికకు కొంపోయే సాహిత్యమే నేడు మనకు కావలసినది అని చెప్పివున్నారు. వీరు చెప్పినది అక్షరాలా యథార్థం.

శ్రీ రామానుజాచార్యులు గారు ఉత్తమశ్రేణికి చెందిన విద్వత్కవులు. అనర్గళంగా, ధారావాహికగా, భావస్ఫోరకంగా పద్య రచన సాగించగల ప్రౌఢులు. శ్రీ ఆచార్యులుగారు అప్పుడప్పుడు వేర్వేరు విషయాలపైని కూర్చిన ఖండికలే ఈ పుస్తకరూపంగా ప్రకటించ బడ్డాయి.

'మధురవేదన' అనేది యిందులోని ఒక ఖండికకు పేరు. ఆ పేరే బాగా ఉన్నట్లు తోచినందున పుస్తకాని కాపేరే పెట్టబడినదట! ఒకటి రెండు శీర్షికలలో తప్ప మిగిలిన అన్ని శీర్షికల్లోనూ ఏదో ఒక సందర్భాన్ని అనుసరించిన వేదనయే అనుస్యూతంగా కానవసుంది. అందువల్ల ఈ పేరు దీనికి సముచితంగానే ఉన్నదని చెప్పాలి.

ఈ పుస్తకంలో పధ్నాలుగు ఖండికలున్నవి. 'అవతారధార' లో దశావతారాల వర్ణన ఉన్నది. 'ఇట్టి సృష్టి యేల?' అనే దానిలో భగవంతుని సృష్టి వైచిత్ర్యాలు వివరించ బడ్డాయి. 'ఆకాంక్ష'లో భక్తుని ఆవేదన, 'మానవాభ్యుదయము'లో లోకంలోని అవినీతి వివరింపబడి ఉన్నవి. 'తిరుపతి కవుల వర్ధంతి, కాటూరి వారి స్మృతి, పోతన త్యాగయ' అనేవాటిలో వారివారిని గురించిన ప్రశస్తి, రచనా వైశిష్ట్యం చక్కగా ప్రదర్శించడం జరిగింది. 'ఖగోళయాత్ర, మేఘమాల, మహాంబుధి శీర్షికల్లో ఆయా విషయాల చిత్రణ కన్నులకు కట్టుతూ వుంటుంది. 'సాత్త్విక జ్వాల' లలో ప్రతారణ చేసే వారి స్వభావం వ్యక్తంగా ఉన్నది. 'సింహావలోకనం' లో భారతదేశ ప్రశస్తి, విదేశ పరిపాలన, స్వాతంత్ర్యసిద్ధి మొదలైన విషయాల సింహావలోకనం ఉన్నది. 'మధురవేదన' లో శ్రీ కృష్ణుడు కుబ్జను అనుగ్రహించిన విషయం రసవంతంగా వర్ణించ బడినది. ఇందులోని వేదనలో మాధుర్యం వ్యక్తమవుతూ, దీని నామాన్ని సార్థక పరుస్తున్నది. ఈ గ్రంథానికి 'అనుభావన' అనే సమీక్షను కూర్చిన శ్రీ సంపత్కుమారా చార్యులుగారు ఈ ఖండిక యొక్క ప్రత్యేకతనూ, ప్రశస్తినీ విపులంగా చూపారు. 'విశ్వరూపము' అనే చివరి ఖండ కావ్యంలో భగవానుడగు శ్రీ కృష్ణుడు అర్జునునికి చూపిన విశ్వరూపం సుగ్రాహ్యంగానూ, సుబోధకంగానూ లలిత లలితాలైన పదాలతో వివరించబడింది. భగవద్గీత చదువుకొనేటప్పుడు అర్థం కాని యీ విషయం ఈ ఖండికవల్ల సులభంగా బోధపడగలదు.

ఈ పుస్తకంలోని విషయాల్లోనూ, వర్ణనల్లోనూ కొంత ప్రాచీన పద్ధతి కానవస్తుంది. అయినా నవ్యత కూడా లేకపోలేదు. 'నేటి భౌతిక ప్రకృతిని వ్యతిరేకించుట నా యభిమతము కాదు. దానితోబాటుగా సమాజమున నైతికముగను ఆధ్యాత్మికముగను ప్రగతి యత్యావశ్యక మని నావేదన' అని రచయిత వివరించారు. ఆ దృష్టితోనే రచన సాగింది. అందువల్ల ఉభయ వర్గాలవారికీ ఈ రచన ఆదరపాత్రం కాగలదని నా విశ్వాసం.

ఇందలి రచనల ప్రశస్తిని వెల్లడించే 'అనుభావన' గ్రంథానికి మెరుగుపెట్టుతూ ఉన్నది.

—ఆంగీరస.

## చల్లనితల్లి

శ్రీ కలువకొలనుసదానంద రచన. క్రౌన్ ఆక్టేవో 80 పేజీలు. వెల: రు. 1—50. ప్రతులకు: విశ్వప్రభ ప్రచురణలు, పాకాల, చిత్తూరుజిల్లా.

ముచ్చటయిన మూడు "పిల్లల—బొమ్మల— కథల సంపుటి. మొట్టమొదటి కథ చల్లనితల్లి కావటంవల్ల ఈ సంపుటి 'చల్లనితల్లి' అయింది. ప్రజాసేవిక మునలమ్మ కథ 'చల్లని తల్లి' తొలి కథ. మేలు మరచిన మానవుడి కథ 'కృతఘ్నుడు' రెండోది. రాజకుమారి—సింహం ప్రేమగాథ 'పు ప్పి— తుమ్మెద' కడాపటిది.

కథలు దంపుళ్లపాటగా చెప్పుకుపోకుండా, మధ్య మధ్య చిన్నిచిన్ని గేయాలు పాడిగారు, రచయిత. కనుక ఈ కథల్ని పిల్లలు పాడుకుంటూ చదువుకోవచ్చు, చదువుకుంటూ పాడుకోవచ్చు.

అయితే—

నిఘంటు అపేక్షగాని, పెద్దవాళ్ళ సహాయంగాని అవసరం లేకుండా, చిన్నపిల్లలు వాళ్లంతట వాళ్లు చదువుకుని ఆనందించగల సుస్థితి ఇందులో అంతగా అగుపడదు. ఒక్కొపూపున చదువుకు పోదామని కుతూహలపడే కుర్రవాళ్లని కటువయిన మాటలు అడుగడుగునా అటకాయిస్తూనే వుంటాయి. చూడండి, మచ్చుకి— వినీలాంబరం, హృదయాంతరాళాలు, మృతకళేబరం, దేదీప్యమానం, కేంద్రీకరింపబడింది, రసాస్వాదనం, గాఢాలింగనం, వంటివి ఎన్నో, కొరకబడనివి, నోట పలుకలేనివి.

ముఖ్యంగా ఈ లోపంవల్లనే, తెలుగునాట పిల్లల పుస్తకాల పేరుతో చెలామణీ అయే సాహిత్య సంపదకు సార్థకత లేకుండాపోతూంది. అటు సోవియట్‌రష్యా, ఇటు చైనా రిపబ్లిక్ బాలసాహిత్యానికి ఎంతటి అపూర్వమైన, అద్భుతమైన కృషి చేసి, అమోఘ ఫలితాలను పొందారో ఈనాడు మనం కళ్లారా చూస్తూనే వున్నాం. ఆ రహదారి పట్టి మనం అడుగుజాడల్లో నడవనైనా పూనిక చూపలేకపోతే...?

రచన, చిత్రణ రెండూ సాగించగల సమర్థులు మనలో బహుకొద్ది. అటువంటి కళాత్మకుడు 'బాపిబావ. మన సదానంద ఆ శ్రేణికి చెందటం ఎంతైనా అభినందించ తగిన విషయం.

## ఇది త్యాగము కాదు

రచన: ముద్దంశెట్టి హనుమంతరావు. ప్రచురణ: నవజ్యోతి పబ్లికేషన్స్. ఏలూరు రోడ్, విజయవాడ—2 పేజీలు 190 వెల: రు. 4—00

తెనుగులో నవలల రూపంలో ఈనాడు వెల్వడుతున్న అసంఖ్యాకమైన పుస్తకాలలో ఇది ఒకటి. ఇటువంటి పుస్తకాల్లో శైలీ సంపద కాని, కథా చమత్కృతి కాని, పాత్ర వైచిత్రికాని వుండవు. కేవలం కాలక్షేపం కోసం వ్రాయబడి, ఒక పాత బారు సినిమాలో మూడవతరగతి ప్రేక్షకునికి

మాత్రం సంతృప్తి నిచ్చే సంఘటనలతో చదివించుకు పోయే గుణంలో వున్న సాధారణమైన పుస్తకమిది. శంకర రావుకు శారద, అరుణ అన్నవారు కూతుండ్రు. ఇద్దరూ అవివాహితులు. శంకరరావు విధురుడు. అరుణ ఉద్యోగం చేసుకొంటున్నది. శారద చదువుకొంటున్నది. మాధవరావు, శంకర్రావుకు బావమరది. త్రాగు బోతు. మాధవ రావుమీద గల కోపంతో అసహ్యంతో శంకరరావు గుండె ఆగి మరణిస్తాడు. బావగారి మరణంలో మాధవరావు మంచివాడవుతాడు. అరుణను ప్రేమించడం మొదలెడతాడు. శారద తన మాస్టారు ఆనందన్ని ప్రేమిస్తుంది. ఆనందం అరుణలు లోగడ ప్రేమించుకున్నారు. విడిపోయారు పరిస్థితులు కలిసి రాక. తన ప్రియుణ్ణే తన చెల్లెలు ప్రేమిస్తున్నదని తెలిసికొని, సోదరికై త్యాగం చెయ్యాలన్న నిశ్చయానికి వస్తుంది అరుణ. ఇంతలో అరుణ ఉద్యోగం కాస్తాపోతుంది. శారద కాలేజికి వెళ్ళడం, మానేస్తుంది. ఆనందంమీద గల అసహ్యంలో శారద, మాధవరావును పెండ్లాడ వలెనన్న నిశ్చయానికి వస్తుంది. ఆనందం మాత్రం శారదకోసమని వారింటికి రావడం మానడు. మాధవరావు శారద ప్రేమను స్వీకరించడు. అరుణ మాధవరావును వివాహం చేసకోవటానికి అంగీకరిస్తుంది. ఆనందానికి యగాక్షి తెంటవుతుంది.— ప్రమాదం మూలంగా శారద



# పుస్తకాలు

ఆనందింల ప్రేమలత మళ్ళీ చిగురిస్తుంది. తెనుగు నవలా కారులకు పట్టుకున్న ఈ ప్రేమ పిచ్చి ఎప్పుడు తగ్గిపోతుందో తెలియదు కాని, అప్పుడు మాత్రమే సమకాలీన సమస్యలను ఆధారం చేసికున్న రచనలు వెలుగు చూస్తాయి. ఉత్తమ గ్రంధాల్ని ప్రచురించాలన్న ఆదర్శం ప్రకాశకులకు కూడా వుండాలి. ఆ ఆదర్శం కొరవడినంతకాలం ఏ బాపు చేతనో అందమైన ముఖచిత్రం వేయించుకొని, లోపలి పేజీల్లో ముద్రారాక్షసాల్తో ఎంటవారన్నా అయిపోయింతర్వాత తీరిగ్గా కూచుని చాకలిపద్దు వ్రాయడం చేతనైన ఆడవాళ్లు శ్రద్ధగా చదువుకోడానికి ఇటువంటి పుస్తకాలే వస్తుంటాయి. —శ్రీరామ చంద్రమూర్తి

## ఫాన్ ఫేర్ ఫర్ ఇండియా

అసోసియేటెడ్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ ఆఫ్ ఇండియా (అస్సోఛామ్)వారు ఇటీవల విడుదల చేసిన బ్రోచర్‌లో భారతదేశంలోని ఆశాజనకమైన అభివృద్ధి అవకాశాలను, గత సంవత్సరాలలో భారతదేశం పారిశ్రామికంగా, ఆర్థికంగా, వ్యావసాయకంగా ఎంతగా అభివృద్ధిని సాధించిందీ, భారీ యంత్ర నిర్మాణంలో, విద్యారంగంలో, ఔషధాల తయారీలో ఎంత ముందంజవేసిందో, రవాణా సౌకర్యాల అభివృద్ధి విపులంగా యిందులో పేర్కొన్నారు. అనేక భాషలతో, అనేక మనస్తత్వాలుగల నమ్మకాలు, ఆచారాలుగల భారతదేశం పటిష్టమైన ప్రజాస్వామ్య వ్యవస్థలోని రాజకీయ విధానాలు లేక ఆర్థిక రంగాన్ని అభివృద్ధి చేయడానికి ఎలా తోడ్పడ్డాయో కూడా యిందులో వివరించారు. భారత దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉన్నదనే స్ఫుటమైన ఆశాభావాన్ని ఆ బ్రోచర్‌తో అస్సోఛామ్‌వారు సోదాహరణంగా వివరించారు. —ఎం. ఆర్.

## శ్రీనివాసకల్యాణము

శ్రీ కృత్తివెంటి వెంకటేశ్వరరావు విరచితమైన 'శ్రీనివాస కళ్యాణము' పద్యకావ్యం మా కార్యాలయం చేరింది. శ్రీనివాస కళ్యాణాన్ని మధురమైన శైలిలో రచించిన రచయిత అభినందనీయులు. 112 పేజీలు గల పుస్తకం వెల రెండు రూపాయలు. ప్రతులకు: శ్రీవెంకటేశ్వర గ్రంధమాల, కొత్తపేట, గుడివాడ, (కృష్ణాజిల్లా). —సితరాజు

# ధర్మపథం

(17 వ పేజీ తరువాయి)

ఇంకొక యింటికిపోయింది. అక్కడా యిదే వరస! ఆమె ఊరంతా తిరిగినా—ఒక్క యిల్లాలు కూడా— బుద్ధుడుచెప్పిన రీతిది కానరాలేదు. ఆమె దిగులు ముఖంతో—ఉత్త చేతులతో బుద్ధభగవానుని వద్దకు వెళ్ళి 'ఎక్కడా అటువంటి గృహం కానరాలే'దని చెప్పింది. అప్పుడాయన 'అమ్మా! చూశావు గదా! మరణం సంభవించని గృహం జగత్తులో ఎక్కడా ఉండదు. పుట్టిన ప్రతి ప్రాణికీ మరణం తప్పదు. చనిపోయినవారు తిరిగి బ్రతుకబోరు. ఈ సంగతి తెలుసుకో జీవితం క్షణికం. ముక్తే స్థిరమైనది. ఈ లోక బంధాలనుగురించి విచారించక, శాంతము అలవరచుకో. నీజన్మ తరిస్తుంది' అని నిదానంగా బోధించాడు.

యువతి మనస్సులోని కలతపాటు తగ్గినది. మనస్సుకు ప్రశాంతత ఏర్పడినది.

# పొడుపుకథ

( 23వ పేజీ తరువాయి)

4 నుంచి 13కి గాని, 8కిగాని వెళ్ళడానికి వీలులేదు. కనుక (4—15) అనే దారిని ఉపయోగించాలి. అల్లాగే 3 నుంచి 7, 12, 14 లకు వెళ్ళడానికి వీలు లేదు. కనుక, (3—11) అనే దారిని ఉపయోగించాలి. ఇటువంటి కారణాలచేతనే. (11—16) ; (16—12) అనే దారులను తప్పకుండా ఉపయోగించాలి, ఇంక మిగిలిన పని సులభమే.

ఈ క్రిందిదారి (లేదా, దీనికి సరిగ్గా తలకిందులు దారి)లో ప్రయాణం చెయ్యాలి.

1—9—5—14—8—4—15—6—10—2—13—7—3—11—16—12—1

బొమ్మలోని దారులలో ఏడింటిని అసలు ఉపయోగించనక్కరలేదు.




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

